ఓం

శ్రీమత్పరాంబికాయై నమః

# శ్రీ కళాసిద్ధి



—♦ ఈ పొత్తము ♦—

మదరాసు యూనివర్సిటీ బి. ఏ. తరగతి
పాఠ్యగ్రంథముగా నిర్ణయింపబడినది.
ఫోర్టుసెంటు జార్జి గెజట్ పేజీ 174
ది 14—3—1939.

---

ఇది

ఆశుకవి కేసరి, అవధాన ధురంధరేత్యాది బిరుదాంకితుఁడు

శతావధానియు నగు

శ్రీపతి త్ర్యంబకరావుచే

రచింపఁబడినది.

1938.

సర్వస్వామ్యసంకలితము]

[వెల 1—0—0.

# తొలిపలుకు

ఈ కావ్యమునకు శ్రీకళాసిద్ధి యన్న నామములోననే కవి కావ్యమందుఁ బ్రతిపాదింపఁబడిన దేవతకు నిందలి నాయకునికిఁ, దనకు సమానమైన కవితాకళకు సంబంధించినట్లు పెట్టుకొనెను. కావ్యనాయకుఁడైన యుతథ్యునకుఁ గళాత్మక యైన పరాంబాసిద్ధి కవితా కళాసిద్ధియు జరిగినవి. ఈ గ్రంథ కర్తకుఁగూడ నీకావ్యముతోఁ గళాసిద్ధియైనది.

ఈ కవి ప్రాచీనుల మార్గమువాఁడు. సుచరిత లక్షణంబునందు నిరాదృతి లేనివాఁడు. అభిమానము కలవాఁడును. కొన్ని ప్రయోగములు చూచినచో నీ గ్రాంథిక వాది కాదని పించును. రసమునకుఁ బ్రాధాన్య మిచ్చును. చ్యుత సంస్కారములు రసభంజకములు కావా యన్నచో వాని భంజకత్వ శక్తియల్పము. ఇతర రస సమృద్ధి కలచోట నవి యెక్కువ పనిచేయవు. ఇతర రససమృద్ధి యీ కావ్యమునఁ జాలకలదు. దానినే యీ కవి కళాదృష్టితోఁ జూచి యీ కావ్యమున కపేరు పెట్టుకొనెను.

కావ్యము యొక్క యుపక్రమోప సంహారములు నూతనములు. కథ యారంభించుచునే పాఠకుని నున్ముఖునిగాఁ జేయున ట్లారంభించుట చాల మంది చేసిన దైనను దానియందుఁ బ్రత్యగ్రత పోలేదు, పోదు.

ఈ కావ్య మయిదాశ్వాసములు. ద్వితీయ తృతీయ చతుర్థా శ్వాసములలోఁ గవి తన నేర్పంతయుఁ జూపినాడు. బీజప్రాప్తి యారంభమున మధ్యాహ్న వర్ణనము బోయవాని వర్ణనము మిక్కిలి కవితాశక్తిని బ్రదర్శించుచున్నవి. బ యవాని వర్ణనయు నతని నోటనుండి వచ్చుమాటలును స్వభావోక్తి రమణీయములు.

అడవిపంది వర్ణనము మిక్కిలి సహజము. కవియొక్క కవితాశక్తిని చూపి చెప్పునదిగా నున్నది. బోయవాఁ డుతథ్యునిఁగాంచి యడవిపంది పోయినదారి చెప్పుడు "నాయాలుబిడ్డలకు నాకీయసువులు నేఁడు నీవయిచ్చినటులా" యనెను. కావ్యములోఁ బలుచోట్లఁ దెలుఁగు దేశపుఁ బలుకుబడి సమృద్ధిగాఁ గలదు. "ఆలుపురుటాలు వెదురుబియ్యమ్ముకూడఁ జిక్కవీ మాపునందున" అన్న బోయవాని శీలముగాని, వాని బాసగాని, యెంతో రమ్యముగానున్నవి.

ఈ కవి తెలుఁగులకుఁ దెలుఁగులు, సంస్కృతములకు సంస్కృతములు రమ్యముగా నుచితముగా వాడఁగలఁడు. మంచి భావనాశక్తికలవాఁడు భావమునకుఁ దగిన శబ్దములు వాడఁగలవాఁడు 'కుమారునివలె జనుబాల్ గ్రోలెడు చనవరితన మెప్డు నాకొసంగుము తల్లీ!'

'నా కన్నీరు స్రవించి గండములపైనన్ జారికల్ తీర్చి తాపై
కట్టెన్ కరదుల్.'

మొదలయిన వెన్నో యీయన తెలుగునుడికారమును జెప్పఁగలవు.

ఈ కావ్యములో నీయన సీసపద్యములయందు నెక్కువయుపజ్ఞయు నేర్పుసేతయుఁ జూపించెను. సీసపద్యము నన్నయ్యగారిసొమ్ము, శ్రీనాథుఁడు దానికిఁ గొన్ని కొత్తబెళుకులు తెచ్చినాఁడు. ఈయన దారి శ్రీనాథునివైపే మొగ్గుకలదియైనను నందు నన్నయ్యగారిలీల గోచరించుచున్నది. 'రాజ సమావేశములోఁ' 'గాకున్న' యన్న దానిలో నన్నయ్యసీసపులీలయున్నది.

కందపద్యముకూడ గడుసుగా నడుపును,

'పురిమాళి వియద్గంగా
తరంగ శీకరతతి దురితమడఁచు హరుకా
పురమగు కాశీపురి'

మొదలయిన రచనలలో నిది కనిపించును.

ఇంకఁ గాశీవర్ణనము క్రొంగ్రొత్తగానున్నది. ఈ కాశీ వర్ణనము చదువగాఁ దెనాలికవిని శ్రీనాథుని జూచి యీయననుజూచి నట్లున్నది. సీసపద్యములలో నీయన శ్రీనాథునివలె నొక క్రొత్త యొడుపు కనిపెట్టి నట్లు తోచును.

ఈయన భావనాశక్తి ప్రాఁతమార్గములనే క్రొత్తదనము నెరపును. 70 యవ పుటలోని మొదటి పద్దెము శరద్వర్ణనము చదివిన తరువాత నీకవికిఁ గళాసిద్ధి కలుగలేదని యెట్లఁనగలము?

కావ్యాంతమందు దేవతలు పుష్పవర్ష ము కురిపించిరి. అదియే ఆఖరు. ఇట్లుపసంహారము చేయుటయందుఁ గవి ప్రతిభ గోచరించుచున్నది.

ఇంతియేకాక ఆకురిసిన పూవుల నెన్ని వానిని వర్ణించుట యెవ్వరును చేయనిపని. అది యీయనగారి స్వోపజ్ఞ ము.

సినిమా వాండ్రకుఁ బలెఁ గవులకుఁగూడ స్త్రీలేకుండఁ గథగడువని యీ రోజులలో నీకవి యొకళపితుని ఒక దేవీదయాపాత్రుని నొక కవిని తెచ్చి వాని కథవ్రాసి రససాధనయుఁ గళాసాధనయుఁ జేయుట ప్రశంస నీయములు.

శృంగారరసము సర్వజనసులభము సర్వకవి సులభము. ఆరసమునం దనౌచిత్యము లేకుండఁ జూచుకొనుట సాధ్యముకాదు. కాని యెట్లు వ్రాసి నను దానికెంతో కొంత యామోదమువచ్చును. తక్కిన రసములట్టివికావు.

అనౌచిత్యమును చప్పున పట్టిచూపును, ఈకావ్యము వీరాద్భుత కరుణములఁ బరామర్శించును, కవి యనౌచిత్యము రాకుండఁ గథను జక్కఁగాఁ దీర్చిదిద్ది వ్రాసెను.

ఉతథ్యుని పాత్రపోషణము మిక్కిలి రమ్యముగానున్నది. అసత్యము హింస యీరెండు దోషము లెదురుగానిల్చి యేదో యొకటి చేయక తప్పని స్థితిలో నుతథ్యుని మెలకువ నికషప్రాయముగానున్నది. అతఁడు నిరాడంబరుఁడు. రాజు తన్నుఁ బొగడుచుండఁగా,

'జ్ఞానమెచ్చటు? భక్తి సంధాన మెచట
ధ్యానమెచ్చటు? మోక్ష నిధానమెచట,'
యొనెచట, తేజమెచట, నుతింప వలవ
దణుసహస్రాళి నేనొక యణువ్రజమ్ము.

ఇది యుతథ్యుని హృదయము నావరించిన దివ్యమైన వెలుఁగు.

నాల్గవ భాగములో గోబిలుఁడు కథయంతయుఁజెప్పి యుతథ్యుఁడర్థరాత్రమునఁ బారిపోవుట చెప్పి యాపెను. తక్కిన కథయేమిటని యుతథ్యు నడిగిరి. ఆయన తానొక బోయల పల్లెలోనుంటినని మాత్రమే చెప్పి యాపెను. దేవీ దర్శనము చెప్పనేలేదు. తన కవితా మహత్త్వమున్ను చేర్కొననేలేదు. ఆతని హృదయము మహావినయావృతము.

గోబిలుని పాత్రపోషణయు మిక్కిలి రమ్యముగా నున్నది. 88 వ పుటలో గోబిలుఁడు తాను దేవవ్రతుని శపించిన కథ చెప్పుచుఁ దాను పాడిన సామగానమును దానే వర్ణించి చెప్పెను, తన సామగానమందుఁ దనకంతటి యభిమానమున్నది గనుకనే తనకంతటి కోపమువచ్చి శాపమిచ్చెను. ఈ రచనయుఁ గవి యుపజ్ఞామూలకమే.

కావ్యము చిన్నదైనను బహుగుణ భూయిష్ఠముగానున్నది. కావ్యజ్ఞులు చదివి వారే గ్రహింతురు. ఈ కవినాకుఁ జిన్నప్పటినుండి పరిచితుఁడు. నేను తొలిపలుకు వ్రాయుట యాయన యా యభిమానము.

ఆధునిక గ్రంథము లిట్టివి పాఠ్యగ్రంథములయినచో విద్యార్థులకు మేలు కలుగఁగలదు. మంచి గ్రంథము లాదరించుచున్న యధికారులు దీనిని గూడ నాదరింతురనియే యూహింపవచ్చును. ఏలననఁగాఁ గవికి యీరోజులలోఁ బుస్తకమ్మోట కదియొకటియే త్రోవ.

2—11—38. విశ్వనాథ సత్యనారాయణ.

శ్రీ కింకవీంద్ర ఘటాపంచాన నేత్యాది బిరుదాంకితులు,

## బ్రహ్మశ్రీ శతావధాని చెళ్లపిళ్ల వేంకటశాస్త్రిగారి

## యభిప్రాయము.

శ్రీపతి, త్రియంబకరాయ కవి రచితమగు కళాసిద్ధి అనెడి కావ్యమును నేను చాలవఱకు చదివి చూచితిని. ముద్రా ప్రమాదములుతప్ప, తదితర ప్రమాదములు నాకు గోచరింపలేదు. ధారధారాళముగనున్నది, విద్యార్థులకు అందులో ముఖ్యముగా, ఆస్తికులకియ్యది మిక్కిలిగా విద్యార్జనకు తోడ్పడు సదూహను కల్గించును. ఎంతశ్రమచేసి చదివినను భగవదనుగ్రహములేనిచో విద్యలలో పెక్కుడు పేరుప్రతిష్ఠలు కలుగవని మన పూర్వుల తాత్పర్యము, దాని కిది ప్రోద్బలకముగానుండును.

దీనినిసర్వథా విద్యాశాఖాధికారులు గౌరవించి గ్రంథకర్తకుప్రోత్సాహము కలిగింతురని నాదృఢ విశ్వాసము. ఇది వఱకే యీకవి కవితాధార రసవత్తరమని చదువరు లెఱిఁగియుంటచే నావిషయమై యిందు నేనుచర్విత చర్వణము చేయక సూత్రప్రాయముగా ప్రధానవిషయము మాత్రమె వ్రాసితిని.

30–10–38, కడియము.

చెళ్లపిళ్ల వేంకటశాస్త్రి,
శతావధాని,

## శ్రీయుతులు శ్రీపతి త్ర్యంబకరావుగారు

అయ్యా!

తమ గ్రంథము (కళాసిద్ధి) చదివి నేను మిగుల నానందించితిని దీనిని విద్యాశాఖవా రాదరింతురని నమ్ముచున్నాను.

బెజవాడ, 2—11—38.

భవదీయుఁడు,
వేలూరి శివరామశాస్త్రి.

శ్రీ మహామహోపాధ్యాయ, కళాప్రపూర్ణ,
కవిసార్వభౌమాది బిరుదాంకితులు

## శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారి యభిప్రాయము

"శ్రీ కళాసిద్ధి" ఇది బ్రహ్మ శ్రీ శ్రీపతి త్ర్యంబకరాయకవి శతావధానిగారిచే రచింపఁబడిన దివ్యప్రబంధము ఇందులకథ దేవీ భాగవతము నుండి సేకరింపఁబడినది కవిగారిని నేను పెక్కుసంత్సరములనుండి ఎరుంగుదును వీరు అష్టావధాన శతావధానములు పెక్కుస్థలములచేసి ప్రసిద్ధిఁ గాంచియున్నారు ఆశుకవిత్వమందు వీరు నిపుణులు. ఈ గ్రంథము కవిగారు చదువగా నేను చాలభాగము వినియున్నాను వీరిందు సంస్కృతాంధ్రములు చక్కగా సాగించియున్నారు. కొన్నికొన్ని స్థలములయందు వీరు ఆధునికుల మతము అవలంబించినారు అది ఇప్పటి విద్యార్థులకు హృదయరంజకంబయ్యెడు ఈ గ్రంథమందు జడుఁడగు సత్యవ్రతుఁడనువాఁడు వాగ్బీజ ప్రభావంబున సకల విద్యాపారంగతుండైనట్లు విద్యార్థులీ గ్రంథ పఠనమున విజ్ఞులగుదురనుట కొంతయు సందియములేదు. కావున విద్యాశాఖవారీ గ్రంథమును గౌరవించి కవిని ప్రోత్సహింతురుగాక.

రాజమండ్రి,
30—10—38.

శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి.

---

# మనవి

ఇది నా యిరువదిరెండవ కృతిప్రదానము ఇందలి గాథ శ్రీ దేవీ భాగవతమునుండి కైకొనఁబడి మూలానుసారముగ కొలఁది మార్పులఁ గావింపఁబడి "శ్రీ కళాసిద్ధి"గా వ్రాయఁబడినది. దీనిని భాషాకోవిదు లాదరింతురని యాశించుచున్నాను. ఈ గ్రంథముపై నభిప్రాయము లొసంగిన ప్రఖ్యాత పండిత కవిపుంగవులగు పూజ్యులకున్ను, తొలిపలుకువ్రాసిన సుప్రసిద్ధ విద్వత్కవిగారికిన్ని, కృతజ్ఞతాపూర్వక వందనశతము లర్పించుచున్నాఁడను. ఇందు, గొన్నిచోట్ల ప్రస్తుతకాలాభిరుచుల ననుసరించితిని.

దాఁక, దాటు, తోఁచు మొదలగు పదములలో నరసున్నల బుద్ధిపూర్వకముగా వదలితిని భేదము నెఱింగియే ర, ఱ, ల నభేదముగా గూర్చితిని. ఇందు ముద్రాప్రమాదము లంతగాలేవు గాని 3 వ పేజీ 8 వ పాదమందున్న "జీవితంపుఁ" అనుదానికి జీవితపు; అనియు సమాప్తంపు అనుచోట సమాప్తపు అనియు, 14 వ పంక్తిలో తోఁటిపాటును తోడిపాటుగాను, 6 వ పేజీ 17వ పంక్తిలో గఱంపు అనుటకు గఱపు అనియు, 34 వ పేజీలో 2 వ పంక్తిలో "బ్రతిమాలు"నకు బతిమాలు అనియు, 56 వ పేజీలో 5 వ పంక్తిలో "అనవుడిలాధవుండు" అనుటకు అనుడు నిలాధవుండు అనియు, 102 వ పేజీ 15 వ పంక్తిలో "వేదశిఖోప దిష్టిత"కు బదులుగా వేద శిఖోపపాదిత,యనియు నిటులనే ప్రమాదములుదొరలిన తావులందు యథోచితముగా సవరించుకొనఁ బాఠకమహాశయులు ప్రార్థింపఁబడుచున్నారు.

బెజవాడ,
2—11—38.

ఇట్లు విధేయుఁడు,
శ్రీపతి త్ర్యంబకరావు,
శతావధాని.

---

# ప్రశంస

క. శ్రీమత్కాఁకురి వంశ
క్షేమ బ్రిభుత్త్వైక విభవ ♦ దీపితు విజ్ఞా
నామృతమయు వేంకటరా
యామాత్యాగ్రిణిని బ్రోవు♦మా జగదంబా. 1

చ. కృతి విరచించి దానిఁ బ్రచు♦రింపఁ దలంపు వహించు మామక
స్థితివిని మిత్రుఁడుం గుణి యు ♦ దీర్ఘుఁడునౌ వరదాభిధానుఁ డం
చితగతి నన్నుఁ గాంచి తమి ♦ నెక్కొన నెమ్మది దీనికింతగాఁ
గుతిలపడంగ నేటికిది ♦గోవిను నాపలుకంచు నిట్లనెన్. 2

ఉ. సారకలా కలాపముల ♦ సాకెదు ధీరు లుదారులౌ జమీన్
దారులు కీర్తి సాంద్రు లుచి♦త స్థిర సత్యవచో విలాస వి
స్ఫారులు దాన ధర్మముఖ ♦ సత్కృతభావు లుదీర్ణులైన కా
ట్లూరికులీనులా ప్రభుల ♦ లోక మెఱుంగు నెఱుంగవా? కవీ. 3

క. గూడూరి వరదారాయుఁ
డాడిన వాక్యముల వించు♦నగు నొకపరి వి
న్నాడను వారల కథ లో
వేడుక గొల్పు వినుచు ము ప♦వి స్తరమునినన్. 4

శా. ఆ మాన్యాన్వయమందుఁ బ్రాభవ కళా♦ హ్లాదుండునా వేంకట
ప్పా మాత్యుండడల బుచ్చమాంబిక స్వకీ♦ యార్ధాంగియై కొల్వ సత్
క్షమ ప్రక్రియలూని వేంకట నగ ♦ శ్రీ వేంకటేశ ప్రతి
ష్ఠామేయ ప్రముదాత్ముఁడై చెలఁగె నం ♦ చాలించినావా! కవీ. 5

ఉ. అన్నప రెడ్డిపల్లిని ర♦మాధిపు నాక్రియనిల్పి నిత్య భ
క్త్యున్నతిమై భజించుచు మ ♦ హోత్సవ రేఖలఁగొల్పుచున్ సుసం
పన్నత నాశ్రిత ప్రతతి ♦ వాంఛితముల్ సమకూర్పు నాతఁడా
సన్నుత బుచ్చమాంబ తన ♦ స్వాంతమెఱంగి మెలంగు చుండగాన్. 6

క. ఆమహిత దంపతులకు
ద్దామకళోపేతు లధిక ♦ ధర్మాంచిత భా
వామేయులు సుగుణఖనుల్
కోమలతను లైరిపుత్రు♦లుగ దగనందున్. 7

శా. జోగారాయ నిధానుఁ డుత్తమ కళా♦స్తోక ప్రభావాఢ్యుఁడుత్
త్యాగ స్ఫార యశోధురంధరుఁడు శ్రౌ♦తస్మార్త నిత్యక్రియో
ద్యోగుం డాశ్రిత వాంఛితార్థదుఁడన ♦ న్నొప్పారి యాధాన స
ద్యాగ ప్రౌఢిమ దీక్షితాంకితుఁడు దా♦నయ్యెన్ జుమీ సత్కవీ. 8

తే. గీ. పెద్ద సోదరులనె కాదు ♦ వివిధకళలఁ
బెద్ద మంత్రిత్వరేఖలఁ ♦ బెద్దయతని
రాజ ధర్మప్రకాశికా ♦ రమ్య సుకృతి
యే యిలంబెద్ద యని వాని ♦ నెరుకపరచు.

తే. గీ. ఆ మహితు తమ్మ గుబ్బులు ♦ రామచంద్ర
దేశపతిరాయలున్ సత్క ♦ వీశ వినుతి
పాత్రుఁడైన శీతారామ ♦ వరకవీంద్రుఁ
డతఁడ ద్విపదగ నల్లె భా♦రతమునెల్ల. 10

తే. గీ. లలిత బృందావనస్థ శా ♦ ద్వల తలాల
వల్లవీకేళికా కళా ♦ ప్రౌఢుఁడైన

బాలకృష్ణవిలాస ప్ర♦బంధములఁ బ్రి
బంధగతిఁ ఘటించిన కవి ♦ వరేణ్యుఁడతండు. 11

తే. గీ. సేవఁగొనరింతు రెపుడు ల♦క్ష్మీనృసింహ
రాయ రంగార్య వేంకట♦రాయులతని
కనుజు లైయుంటఁ గవిగోష్ఠి ♦ యనుజుఁడైన
శేషగిరి పిన్నతనమంద శేషుఁడరెరె, 12

శా. గుండేపూడి ప్రభుం డుదారుఁడు కళా♦గోష్ఠీ వచఃప్రౌఢుఁ డు
ద్దండారాతి భయంకరుండు మహితో♦ద్యద్దాన ధారావహో
ద్యుక్తుం డంతర్ముఖుఁ డాశ్రితావనుఁడు యో♦గ్యుండన్నిటన్ ధాత్రి నా
తండే, వేంకటరాయ మంత్రియనఁగా ♦ దైవారె జూమ్మా కవీ 13

సీ. కవివరేణ్యులతోడ ♦ గౌరవమే పార
విద్యాంబులందు వి♦వేకమహిమ
రాజరాజులకెల్ల ♦ తేజః కళలుజారఁ
జెలిమి చేయఁగఁ జాలు ♦ కలికితనము
తనపేరు శాత్రవ ♦ తతికి సింహస్వప్న
మై యొంపఁదగు విక్ర♦మాతిశయము
శ్రిత సంచయము బంధు ♦ వితతిభంగిగఁ గాంచి
తద్వాంఛ లీడేర్చు ♦ త్యాగగుణము

తే. గీ. సతత లౌకిక వ్యాపార ♦ చర్యలందె
వేదవేదాంగవిద్యా ప్ర♦వీణతయును
చూతుమేనియు మానవా ♦ తీతుఁడని త
లంపవచ్చును వేంకట♦రాయ సచివు. 14

క. వనితల తలచూడామణి
యన నొప్పిన చూడమాంబ ♦ యర్ధాంగిగ నా
ఘనుఁడేసఁగె రమానారా
యణులని బుధులాత్మనెంచి ♦ యరుసము నందన్. 15

తే. గీ. వారలకు స్వీకృత సుతుండు ♦ భవ్యమూర్తి
రామకృష్ణాఖ్యుఁడటుపైనఁ ♦ బ్రభవమందె
నారు దమయంతియును శకుంత ♦ లా రమణియుఁ
బుత్రికలు నోచు వంశ ము♦ప్పొంగ సుకవి. 16

ఉ. ఆ సుదతీమతల్లులకు ♦ నర్మిలిఁ బుత్త్రుఁడు సన్నుతాఢ్యుఁడై వి
ద్యా సముపేతమూర్తి కవి♦తా వనితా స్మిత చంద్రికా కళా
వాసిత భావ కైరవ వి♦భాసురుఁడైన యువ మహేశ్వరుం
డాసచివాగ్రగణ్యునకు ♦ నాయమకున్ దొలినోము పంటనన్. 17

తే. గీ. చూడ మాదేవి సలిపిన ♦ సుకృతఫలము
సత్యమూర్తి వేంకటరాయు ♦ జ్ఞాన ఫలము
కొడుకు గుజ్జుయి, కనుపట్టఁ ♦ దొడఁగెనా, యు
మామహేశ్వరుం, డనఁగ నా♦మాన్యుఁడిపుడు. 18

తే. గీ. చూడమాదేవి, స్వర్గంబుఁ ♦ జూరగొనుట
సర్వసంగ పరిత్యాగి ♦ చాయ, నిదురఁ
బొందు, వృద్ధసింహంబట్లు ♦ ప్రొద్దులెట్లొ
త్రోయుచున్నాఁడు, వేంకట ♦ రాయఁడిపుడు. 19

తే. గీ. కాన నీవేగి కొంచుమా ♦ ఘనుని, వారు
నాకు మాతులు లగుట, నిం♦తగ వచించి
నాడ, నీకోర్కె తీర్తు రం♦చాడ నాతఁ
డెలమి నేను, గుండేపూడి ♦ కేగుదెంచి. 20

ఉ. శారద యింటిముంగిట ప♦చారులొనర్పఁ దురంగమోరు పే
పారవ మాశలన్ బరవ ♦ నాశ్రిత సంతతు లొక్కదిక్కు, కై
వారము సల్ప వృద్ధరవి ♦ వైఖరినున్న, ప్రశాంతభావు, వి
ద్వీరుననూనవాక్కలితు ♦ వేంకటరాయ నిధానుఁగాంచితిన్. 21

క. కొంచి, మదుదంత మెఱుఁగగ
నెంచిన వినుపింపఁగార్య ♦ మెల్లవినుచు, యో
చించి, మదీయ కుమారుఁ డు
దంచితమతి, వానితోడ ♦ ననుఁడిది యనుచున్. 22

ఉ. ఏనొక వృద్ధుఁడన్ గల, య♦భీష్టములన్నియుఁ దీరిపోయె, వి
జ్ఞాన విరాగభావమున ♦ శాంతిగ కాలము నెట్లొ త్రోయఁగా
మానసమందు నెంతు నను ♦ మానములేదు, మదీయపుత్త్రుఁ డే
మేని యొనర్ప నెంచిన ఘ♦టిల్లుఁ ద్వదిచ్ఛయటంచుఁ బల్కెనన్. 23

తే. గీ. శాంతగంభీర మృదుల వా♦క్సారవిభవు
నిందిరానాధు, సవిన యా♦నందభావు

నాయుమామహేశ్వరరాయు ♦ నాత్మకెక్కఁ
ఒలికి నా కృతి, జూచిన ♦ పట్టునందు. 24

తే. గీ. సప్తసంతానములను, ప్రశస్తి కెక్కి
నట్టి మీకిదివోలు, విఖ్యాత ♦ యనుచు
రమ్య వాగ్వర్తి శ్రీగొర్తి ♦ రామమూర్తి
నచ్చచెప్ప, వేంకటరాయఁ ♦ డిచ్చగించి. 25

మ. మలయన్ లేనగవాననంబుపయి స ♦ స్మచ్చారు కృత్యంగనా
కళపైఁ బ్రేమడిచూడ్కు లన్ దెలుపుచున్ ♦ గానీయుఁడాయర్థము
జ్వలతన్ మేమిదువారమన్న విని, సం ♦ భావ్యుండు, తత్పుత్రుఁడున్
దలయూపెన్ దనవాంఛ యిక్కరణిగా ♦ దైవారె సంచాదృతిన్. 26

తే. గీ. తండ్రియుఁ గుమాళ్ళు, ప్రభువు లు ♦ దారచరితు
లాప్త బాంధవు లైయొప్పి ♦ రరయనావు
నేటి కవ్వారి దాతృత్వ ♦ నిరతివలన
ముద్రణాభారమును ద్రోసి ♦ పుచ్చినాడ. 27

చ. మనుమల పెంపు, పుత్రుల, స ♦ మగ్రకలా కుశలత్వతత్వ సం
జనితయశః ప్రకారము, ప్ర ♦ సన్నుల నల్లుర పార్థివంబు, లా
త్తనయలు నైన కూతుల, ము ♦ దంబు నిరంతరమున్ ఘటించి న
వ్యనుత కళాప్రవీణుఁడగు ♦ వేంకటరాయని బ్రోవుమంబికా. 28

శ్రీ శ్రీ శ్రీ

ఇట్లు శ్రేయోభిలాషి,

శ్రీపతి త్ర్యంబకరావు,

శతావధాని.



ఆశుకవికేసరి, అవధానధురంధర Etc.,

శతావధాని

శ్రీపతి త్ర్యంబకరావు

ఓం
శ్రీ మత్పరాంబికాయై నమః

# శ్రీ కళాసిద్ధి

# అంజలి

సీ. చంచరీకము, జగ ♦ జ్జననీపద సరోజ
మకరంద పాయియై ♦ మలయు వేళఁ
గరుణాంబుదము, దీన ♦ నరపరిత్రాణార్థ
మురుదాన కంకణం ♦ బూను వేళ
జిత యుగంధరుఁ, డుదం ♦ చితలౌకిక వ్యవ
హార కార్య జయాఢ్యుఁ ♦ డైన వేళఁ
బరమహంసస్వామి ♦ ప్రత్యక్ష పార్వతీ
పరమేశులఁ గని మేన్ ♦ దొరఁగు వేళ

తే. గీ. సిత యశోమూర్తి, స్థిర నిజా ♦ శీః ప్రసూత
మామక కలాకలాపసం ♦ పద్విధాత
మా జనకుఁడు, శ్రీరాములు ♦ మంత్రిమౌళి
యడుగులకు, మత్కృతి ప్రస ♦ వార్పణంబు.

ఇట్లు,
గ్రంథకర్త.

ఓం

శ్రీమత్పరాంబికాయైనమః

# శ్రీ కళాసిద్ధి

శా. శ్రీమద్బ్రహ్మపదార్థవిస్మృనిజన ♦ శ్రేణీ హృదంభోజ వీ
ధీమధ్యస్థ మరాళమై ప్రణవమై ♦ దీపించుచున్ లోకర
క్షా మేయస్థితి నాకృతుల్ గొనుచు స్వే♦చ్ఛాలీలలం గ్రాలునా
శ్యామానూన సువర్ణదుర్గ నెదలో♦నర్చింతు నశ్రాంతమున్.

... ... ...

## హృదయవేదన

తే. గీ. అది మహారణ్యభూమి యం♦దందుఁ గొఱవి
దయ్యముల కాగడాలడాల్ ♦ దారిభీతి
గొలుపు ఖద్యోతముల వెలుం ♦ గులకు నిలయ
మైన సాంద్రతమశ్ఛటా ♦ వ్యాప్తవేళ.

తే. గీ. అట్టితఱి నొక్క జీర్ణ ప♦ర్ణాలయమున
నవయు మెయితోడ మొగుడు క♦న్గవలతోడ
నడలు నెదతోడఁ జివిఁగిన ♦ తడుపుతోడ
బుడుతఁ డొకఁ డేదియో తల ♦ పోయుచుండె.

మ. కలవేమో! నిరతవ్యథా క్షుభిత దుః♦ఖ ప్రోజ్జ్వల ద్వహ్నికీ
లలు హృద్గోళమునందుఁ గన్గవలఁ గ్రా♦లం జాగెఁ గెంజాయలూ
ర్పులలో నగ్గిసెగల్ జనించెఁ బసిమో♦మున్ గప్పె ధూమమ్ము చా
యలు నాఁజుంజురు నెండ్రుకల్ చిఱుతపా♦యమ్మెట్లుగా నోర్చెడున్.

ఓం

శ్రీమత్పరాంబికాయైనమః

# శ్రీ కళా సిద్ధి

శా. శ్రీమద్బ్రహ్మపదార్థవిన్మునిజన ♦ శ్రేణీ హృదంభోజ వీ
థీమధ్యస్థ మరాళమై ప్రణవమై ♦ దీపించుచున్ లోకర
క్షామేయస్థితి నాకృతుల్ గొనుచు స్వే♦చ్ఛాలీలలం గ్రాలునా
శ్యామానూన సువర్ణదుర్గ నెదలో♦నర్చింతు నశ్రాంతమున్.

... ... ...

## హృదయవేదన

తే. గీ. అది మహారణ్యభూమి యం♦దందుఁ గొఱవి
దయ్యముల కాఁగడాలడాల్ ♦ డాఁటిభీతి
గొలుపు ఖద్యోతముల వెలుం ♦ గులకు నిలయ
మైన సాంద్రతమశ్ఛటా ♦ వ్యాప్తవేళ.

తే. గీ. అట్టితఱి నొక్క జీర్ణ ప♦ర్ణాలయమున
నవయు మెయితోడ మొగుడు క♦న్గవలతోడ
నడలు నెదతోడఁ జివిఁగిన ♦ తడుపుతోడ
బుడుతఁ డొకఁ డేదియో తల ♦ పోయుచుండె.

మ. కలవేమో? నిరతవ్యథా క్షుభిత దుః♦ఖ ప్రోజ్జ్వల ద్వహ్నికీ
లలు హృద్గోళమునందుఁ గన్గవలఁ గ్రొ♦లంజాగెఁ గెంజాయలూ
ర్పులలో నగ్గిసెగల్ జనించెఁ బసిమో♦మున్ గప్పెధూమమ్ము చా
యలు నాజుంజురు వెంద్రుకల్ చిఱుతపా♦యమ్మెట్లుగా నోర్చెడున్.

తే. గీ. తల్లి దండ్రుల చెంగట ♦ నల్లిబిల్లి
ముద్దు ముచ్చటలం దేలు ♦ బుడుతపాయ
మక్కటా! యెట్టిచింతల ♦ నవసి పోయె
నాదరింతురె? దైవోప ♦ హతుల నొరులు.

క. శిర మూపుఁ బెదవిఁ గఱచును
దొరలిన కన్నీరు గోటఁ ♦ దుడుచును తలపైఁ
గరముంచు నూర్పు బుచ్చును
బొరలును శూన్యహృదయుఁడయి ♦ పొగులుమనమునన్.

తే. గీ. మనమునకు నందరాని వే♦దనపుటగ్గిఁ
గొంతతడ వట్లు మ్రగ్గి క♦న్గొనలనుండి
యశ్రువులు కాల్వగట్టగా నందు మసక
వెలుగు నిడు క్రొవ్వుదివ్వెపై ♦ నిలిపి చూడ్కి.

తే. గీ. ఎడ తెగని వేడికన్నీట ♦ నుడికి యుడికి
హృదయభర మింత తగ్గిన ♦ రీతి నుంట
నూర్పులం బుచ్చి నెమ్మది ♦ యూరడిలఁగ
గద్గదధ్వని నిట్లనఁ♦గాఁ దొడంగె!

మ. విరజిమ్మన్ బనియేమి! శాప విలయా♦భీలాగ్ని కీలల్ ప్రశాం
తరసోదార ధరామరామృత కరో♦ద్యన్మూర్తి హాలాహల
స్ఫురణల్ దక్షిణ గంధవాహములలో ♦ బుట్టొందగా నేల? మ
ద్దురదృష్టంబుననయ్యెఁబో ప్రకృతియుం♦దుర్మార్పులీభంగిగాన్.

చ॥ ఉమిసితి కాలకూటభయ♦దోజ్జ్వలదగ్నికణాళి మాతృగ
ర్భముజొరనడ్డై, యీనిరప♦రాధునిపై నపుడే తదుగ్రకీ
లి మముల నొక్కసారి కబ♦ళింపఁగ బోవ కిటేల ఖండఖం
డములుగ కాల్పనెంచితో? మ♦నంబున విప్రభుజంగపుంగవా

శా. ఏనాఁడో నవమాధవాంచితకృపా♦వృష్టిన్ విరాజిల్లు నం
చీనాడీసుమవల్లిఁ ద్రుంపఁదగునో!♦యీభంగిగాఁద్రుంగు,ని
ద్దానిన్ గూర్చెడువాఁడు కన్బడడు కా♦దా! నేటిదాక న్నివే
షో;నాజీవితఁపున్ సమాప్తఁపుదినం♦బుల్ శాపకాలాంతముల్.

ఉ. ఈలత వాడువారియు న♦శింపక నిల్చిన దింతనట్టు దు
ష్కాలము దాటినన్ నవ వ♦సంతసమాగమ సౌరభప్రసూ
నాళి రహింతునన్న యడి♦యాసను కాదె! తదాశభగ్నమా
లీలలుదోచెదీనినిటఁ ♦ ద్రెళ్లగ చేయుదో? ప్రోచెదో,ప్రభూ!

ఉ. దీని ననూన సూనములఁ ♦ దేల్పవయేని నరణ్యపుష్పసం
తానముతోటి పాటుగ వి♦నాశము చేయఁదలంతువేని నెం
తేని సృజింపనేటికి? సృ♦జింపకమున్న మహీసురాగ్రహో
గ్రానల తప్తఁజేయుటకు ♦ నై, తలపోయగ నేటి కీశ్వరా!

మ. క్రతుభుగ్వంద్యుఁడు శాంతమూర్తి నిగమా♦ర్థవ్రాతనిష్ణాతుఁడా
తతదుర్గాపద పంకజాత మకరం♦దస్వాదనోద్యన్మధు
వ్రతుఁ డిచ్ఛారహితుండు దీక్షితుఁడునై ♦ రాజిల్లునవ్వానికా
క్రతుకాలంబునఁ గోపమెట్లుకలిగెన్ ♦ గర్హంబుగా కీశ్వరా!

చ. చందురునందుఁ గందుబలె ♦ సంయములందుఁ గ్రుధారసంబు నిం
పం దలపోసినాఁడవొకొ ♦ భావమునందు నికేమనందు నా
చందము వాఁడు మానిజన ♦ సన్నిధి దీక్షితుఁడయ్యు సామలో
లుండగు వాని నాక్రియ దు ♦ రుక్తులనొంపఁగఁజాలునే ప్రభూ.

చ. మదవృషభద్వయంబు నడు ♦ మంగల లేగ నడంచినట్టు లి
య్యది కనుపట్టుచున్నదక ♦ టా విరసోక్తుల వారుదూఱుకొం
చెదియు నెఱుంగనట్టి జని ♦ యింపని పాపని కిట్టిపాటు క
ట్టిదముగఁ గూర్పనెంచిరి పె ♦ ళీలుమనన్ వినువారిగుండియల్

క. ఇది నీదు విలాసంబని
యెద శాంతిం జిక్కఁబట్ట ♦ నెంచెదనో నా
దు దురితఫలంబని యే
డ్చెదనో ముందేమి గతి ఘ ♦ టించెదవో ? ప్రభూ.

ఉ. లోకులు కాకు లీకథ నె ♦ ఱుంగని వారలు లేరెఱింగియున్
నాకయి వ్రేలుచూపి చెడ ♦ నాడుచు మొద్దనుచున్ హసించి ఛీ
ఛీ కులనాశకుండనుచుఁ ♦ జీకొన నేమికతమ్మొ? తండ్రి యీ
వ్యాకులకున్ విషాదమయ ♦ భావుఁడనై వెతఁగుంద దైవమా.

చ. కలిగెఁ బ్రమాదమాది బుధ ♦ గణ్యుఁడు దివ్యతపస్వి శాప వా
క్కులు వృథగావు కన్నకొడు ♦ కుం జడు జేయక లోన వేదనా
జ్వాలన మనుక్షణం బుసురు ♦ వాయఁగ నీకదహించు నిట్టు లే
డులు పదునాలుగోర్చెద రె ♦ టుల్ గురులాత్మలఁ ద్రెళ్లకక్కటా.

మ. పదునాల్గేడులపైన రాఁగల శుభ♦ప్రాప్తిన్ వితర్కించి దో
హదముల్ జల్పిరి తల్లిదండ్రులు మునీం♦ద్రాశీర్వచోవృష్టి, నె
ట్లొదవున్? జారుకళావిభూతి యతివ♦ర్యోగ్రాంశుచండాతప
వ్యథితంబై వసివాడు తీవ కకటా♦వారల్ ప్రమోదింపఁగన్.

క. తొలిచూలు పూవు త్రుంగిన
నిలువున కంపించి పోన♦నెపమున దుఃఖా
శ్రులరాల్చు లతాసతి నాఁ
దలఁకు మదంబికఁ దలంపఁ ♦ దను వవశంబౌ.

ఉ. అంతటి ప్రేమమూర్తి కిసు♦మంతయుఁ దెల్పక యర్ధరాత్రి నే
నింతయు కృత్యముల్ సలుప ♦ నెంచితి నెంతటి పాపినైతి నా
వంత యెఱుఁగరానిది క♦దా తొలిజన్మ మదేకపుత్రితా
స్వాంతమునందు నెట్లహర♦హమ్ముగుమారిలుచున్నదో కటా.

మ. ప్రతివాఁడున్ ననుఁబ్రువ్వదిట్టినను లో♦పంబేమి నిష్కామ ని
ర్వృతి మాతాపితృలన్ భజించిగడు వె♦ల్లేఁద్రోయ కీర్తిఁ జి
న్నతనంపున్ జెయిదింబొనర్చితి గురుల్♦నాకై విచారించి యే
గతులంబొందిరొ నన్ను నేమనిరొ శో♦కజ్వాలలన్ గ్రుగ్గుచున్.

ఉ. మూఁడు సమల్ గతించినవి ♦ పో తలిదండ్రుల వీడి యింతకున్
జూడదు మృత్యుదేవత స♦నుంగని యేవము నూనెనో పితల్
గూడ గతించినాఁడ ననుఁగొంచు వ♦హింతురు శాంతి మూర్ఖనే
నాడును ద్రొళ్ళనీక దహ♦నం బొనరించునొ దైవమక్కటా.

ఉ. ఈ పదునాల్గువత్సరము ♦ లేగినచో నిగమాగమాది వి
ద్యా పరిపూర్ణుఁడై సుకవి♦తల్లజుఁడై సితకీర్తి చంద్రికా
వ్యాపిత దిక్తటుండయి నృ♦పవ్రజ పూజితుఁడై యెసంగు నీ
పాపఁడటన్న గోబిలుని ♦పల్కొటు సార్థకమానో నాయెడన్.

శా. శాపాంతమ్ము ననుగ్రహించె నెపుడా ♦ సంవత్సరంబయ్యె దే
రేపీపాటికి వచ్చు విద్యలఁబవల్ ♦ రేల్ నేర్చినన్ గాని నా
కేఫక్కిన్ ముని యన్నటుల్ జరుగు న♦న్నెవ్వారలో సర్వవి
ద్యాపారంగతుఁ జేయువారు జగదం♦బా యేమి కావించెదో?

క. ఓ యనినం బోయను, నా
కా యతులిత చతుర లలిత ♦ కవితావనితా
గేయసుఖానుభవైక
స్ఫాయ దుదారంపుఁ గీర్తి ♦ పాల్పడు టంబా!

తే. గీ. దైవ మానవ తతులకు ♦ ద్య త్రిప్రియమ్ముఁ
గలుగఁజేయు నరుఁడు విద్య ♦ కతన దాని
సర్వయత్నమ్ములంబొందఁ ♦ జాలువాఁడె
ధన్యుఁడుఁ గృతార్థుఁడున్ సుకృ♦తాత్ముఁడవని.

తే. గీ. జీవమర్మంబు గఱపు దే♦శికుడు విద్య
జీవనోపాధి చూపెడు ♦త్రోవ విద్య
జీవదారిద్ర్య మెడపు ల♦క్ష్మియును విద్య
జీవముక్తి నిచ్చెడు మంత్ర♦సిద్ధి విద్య.

తే. గీ. అట్టి విద్యావిధాన మ ♦ హత్వసిద్ధి
నక్షరజ్ఞాన శూన్యుండ ♦ నైన నాకుఁ
గలుపువార లెవ్వారు దు♦ర్గా కటాక్ష
వీక్షణ మొకండు దక్క పృ♦థ్వీతలాన. 29

చ. కడచిన గాథలం దలఁచి ♦ కందఁగనేల సువర్ణదుర్గ యే
వడువుననేఁ గృపామృతల♦వంబు నొసంగి యనుగ్రహింపఁగాఁ
దొడఁగిన భావిజీవిత మ♦థోగతిఁ ద్రెళ్లకయుండు లేనిచో
నెడసెదఁగాక జీవమిట♦నే; యొరు లెవ్వరెఱుంగకుండగాఁ.

క. అడవిఁ బొడమి తమయంతనఁ
బొడవడఁగు సుగంధకుసుమ♦ముల భంగిని, నా
యొడలిటుఁ ద్రెళ్లెడునో; యే
యొడుపుననే నంబ కాచు♦నో? కావదొకో ?

క. అని యాతం డను కొనునెడఁ
గనుఁగవ మిఱుమిట్లు గొల్పఁ♦గా ఘనతరకాం
తి నికాయము కట్టెదుటం
గనరా నరగంటఁగాంచి ♦ కలఁతవడి మదిన్.

క. దినములు మూడేగిన వీ
ఘనతర తేజంబు కనులఁ ♦ గనుపడెడు నిదే
మని యూహింప వశముగా
దనవద్యం బద్భుతంబు♦నై దైవారున్.

సీ. ఒకవేళ నెన్నఁడో ♦ యూహించి నట్టులు
శారదాచ్ఛజ్యోత్స్న ♦ చాయలూను
నొకవాడెపుడొ చక్షు♦రుత్సవంబైనట్లు
బాలసూర్యారుణ ♦ ప్రభలనేలు
నొకక్షణం బెచటనో ♦ యున్నట్లు దోపించి
చిత్రచిత్రాగ్నుల ♦ చెలువు నీను
నొకదినం బెదుటనే ♦ యుండినట్లు జెలంగి
శంపాలతా సహ♦స్రరుచి మించు

తే. గీ. నొక్కయెడ సువర్ణచ్ఛవి ♦ నొప్పియొప్పి
యంతలోన నదృశ్యమౌ ♦ యది యిదంచుఁ
దెలియరాని మహాద్భుత ♦ తేజమొండు
మూడు దినములనుండి వె♦న్నాడు నన్ను.

తే. గీ. ఇది యమానుషమగునేని ♦ నీప్సితార్థ
సిద్ధిఁ గూర్పక నన్నేల ♦ చివుకచేయుఁ
గాన నావాస ఢాకినీ ♦ గణకృతంబె
మైన నన్నేల మ్రింగక ♦ యాలసించు.

చ. ఇదియెదియో మదూహలకొ♦కింతయుఁజిక్కనిదా పరాంబనె
మ్మది దయఁబూని యిక్కరణి♦మ్రోఁగనవచ్చినదన్న! నేఁ జపిం
పఁదలఁపఁ గొల్వఁబోవ నిటు♦వంటి దరిద్రున కామె, దర్శనం
బొదవుటలెన్ని జన్మములకో; తెలియందరమౌనె? యక్కటా!

క. అదియింత సుకరమగునే
మది నింద్రియముల నడంచి ♦ మాట లుడిగి యే
లదపముఁ గావింతురు ముని
లుదకము లాహారములుగ ♦ నుగ్రాటవులన్.

క. అనియాతఁడు తలఁచెడునెడ
మనమున నుత్సాహ మొక్క ♦ మాదిరి మోదం
బున ముంపగ నిస్సంశయ
మునఁద త్తేజమ్మునందు ♦ బుద్ధినిలుపుచున్.

క. ఈయత్యద్భుత తేజం
బాయంబా దేహరోచి ♦ యఁగు సందియమే
లా! యాశ్రిత రక్షామతి
వై యనుకంప నిటు వచ్చె ♦ నా యంబికయే.

తే. గీ. ఈమహాటవి నీ యాకు♦టీరమందు
నీ నిశామధ్య వేళల ♦ నిట్టిభంగి
నేడ్చుచుండెడు నా కండ ♦ యెవ్వరుండి
రా జగన్మాత, కాక య♦థార్థమునకు.

తే. గీ. బాల్యచాపల్యమునఁ గొండ ♦ పైకినెక్కి
శిఖరమున్ దాకఁగఁ బ్రతిజ్ఞ♦చేసి కాలు
జారి లోయలోఁబడినట్టి ♦ సమయమందుఁ
గాచె నాజగదంబయే ♦ కాదె తల్లి.

శా. ఇమ్మాన్మడ్కిం గల వెన్ని యేనియును లె♦క్కింప న్నశక్యంబు ల
బ్దమ్ముల్ మూడు గతించె నీవిపిన మ♦ధ్యంబందునన్ జూడఁ జు
ట్టమ్మా మ్రొక్కగ దైవమా! కలసి మా♦టాడంగ నెయ్యమ్ము శో
కమ్మున్ దీఱిచి విద్య నేర్పఁగల ది♦క్కా మొక్క దుర్గేశ్వరీ.

క. ఈపాపని నీపా పని
నే పద్ధతిఁ జూతువట్టు లీక్షించి దయా
వ్యాపార మూని చదువుం
బ్రాపున్ ఘటియింపు మమ్మ ♦ వైళంబంబా!

క. ఇటు లతఁడు వేడుకొనుచో
స్ఫుటసాహిత్యార్క దీప్తి ♦ పుంజం బటు ల
వ్వటునకుఁ దత్పటు తేజః
పటలము గనరానతండు ♦ భక్తి వివశుఁడై.

తే. గీ. కన్ను లరమోడ్చి కైమోడ్చి ♦ గద్గదరవ
మాశల న్నిండ నంబ యం♦బా పరాంబ
పాహి మాం, పాహి, యని నిలం♦బడెదులోన
ధరణి కొరగెను తన్మయ♦త్వమ్ముఁ జెంది.

తే. గీ. ఆకరణి సోలుపాటులో ♦ నతఁడు కాంచెఁ
గనకదుర్గా కృపాకటా♦క్షంబువశత
భావిజీవిత మహితవి♦ద్యావిధాన
భాసురానందకరము స్వ♦ప్నంబొకండు.

## స్వ ప్న దృ శ్య ము

సీ. నును నును మంచు బిం♦దువులనేలకుఁదార్పఁ
గన్నెతీవగమి చె♦ల్లాటలాడ
నరవిచ్చుక్రొవ్విరి ♦ తెఱవతో తెమ్మెర
కోడెగాడు రహస్య♦గోష్ఠి సలుప
విడి మేగుతల్లుల ♦ యొడులలోనఁ బులుంగు
కూనలు గారానఁ గునియుచుండఁ
గెంపు క్రొం డాలింపు ♦ నింపఁగా సెలయేటి
పడఁతి హాయిగ పాట♦బాడఁబూన
తే. గీ. నరుణు మణిమకుట ప్రభ♦లఖిలలోక
తతి రజోరాగమాలికా ♦ ప్రతతిముంప
నిదుర చొక్కుఁదక్కుచు నుష♦స్సుదతి వీణ
లలితభూపాల రాగస్వ♦రమ్ముఁగూర్ప.

సీ. ఫలభార నమ్రశా♦ఖల నల్లనఁ గదల్చి
మ్రానితొయ్యాలి పూల♦రాల్చుదారిఁ
బ్రకృతికాంతకు నొక్క♦రంగు సింగారించు
లేతపచ్చికబయల్ ♦ చెలఁగుదారి
నతిలోక మోహనాం♦చిత శకుంతారావ
కలన దిక్కులు తెల్పఁ ♦ గాంచుదారి
నలఁతి నవ్వుల కోయ ♦ చెలులు గుముల్ కట్టి
దండాటలాడుచు ♦ నుండుదారి

తే. గీ. రకరకమ్ములచీర ల ♦ లంకరించి
పంటల చిరంటికల్ కంట♦బడెడుదారిఁ
బారలు విచ్చిన పచ్చ క♦ప్పూరఁపుదావి
నిండియుండెడుదారి న♦తండు నడచి.

సీ. ప్రొద్దు పొడుపు డాలుఁ ♦ ద్రోసి రా జనఁజాలు
భూరి భూమీధరం♦బులను దాటి
మగరాల తలదన్ను ♦ నిగనిగల్ గల పూల
మొత్తంపు టుద్యాన ♦ భూమిదాటి
మిన్నేటి కెరటాల ♦ తెన్నుఁ గేరడమాడు
తెలిదమ్మి విరికొలం♦కులను దాటి
రిక్కల గమినెక్క ♦ సక్కం బొనర్చెడు
తెలిముత్తియంపుఁ బం♦దిళ్ల దాటి
తే. గీ. లలితవిహృతి సమాయాస♦కలితకిన్న
రీవిపంచీనినాద ఘూ♦ర్ణితము లైన
కోన సీమలదాటి య♦నూన మోద
మగ్న మానసుఁడగుచు నా♦మాన్యమూర్తి.

ఉ. అంబర చుంబి తైక శిఖ♦రాచిత కేతన ముల్లసన్మణి
స్తంభగు భిత్తి ద్వారము లు♦దార చకచ్చకి తోరువజ్రదీ
ప్తంబులు రత్నకల్పిత క♦వాటములొప్ప సహస్రభానుభా
నుంబురడించుసౌధముఁగ♦నుంగొనె విస్మయమావహిల్లఁగన్.

సీ. గారుత్మ తద్వార ♦ కాంతి నుల్లసమాడు
నవ్య శిరోవేష్ట♦నమ్ము చెలఁగ
వివిధ మణీహార ♦ వితతి కంఠమునందు
నింద్ర ధనుర్దీప్తి ♦ సీసడింప
నధికారి రత్న నా♦మాత్సర్య సర్ణమే
ఖల మధ్యమందునఁ ♦ గళుకులీన
శ్వేతారుణాసిత ♦ చిత్రచిత్రిత మైన
కోలపచ్చల కంక♦ణాళిఁదనర

తే. గీ. నాననజ్యోత్స్న యాశాంత♦మై రహింప
మధురగంభీర దృక్స్వరం ♦ పరలెసంగ
జాగరూకత హెచ్చ హ ♦ జారముకడ
నిలువఁబడియున్న యొక దేవ♦లలనఁ గాంచె.

తే. గీ. కాంచి యాలేమచెలువమ్ముఁ ♦ గాంచిఁ గాంచి
యందు దైవారు రత్నాక్షు♦ రార్ధమరయు
నంతలో నామె మందస్మి ♦ తాస్యయగుచు
నతని నాపాదమస్తకం ♦ బరసి యరసి.

తే. గీ. చేతఁగల కోలద్వారమ్ము ♦ చెంత నాన్చి
కెలన వ్రేలాడుగంట మో్రిగించి ప్రతివి
రావ మాలించి మంజీర♦రవము కడలఁ
బ్రిణవమటు మో్రియనల్ల న♦ల్ల నన కదలి.

సీ. పదసార సమ్మోలఁ♦బడి యాడు కుచ్చెళుల్
చివురు కొ్రింజాయలఁ ♦ జీ యనంగ
మార్గమ్మునకు జిత్రి♦మణి దీపికనమర్చు
గ్రైవేయకము తటి♦ల్లత న దల్ప
మందస్మితానూన ♦ సుందరాస్యచ్ఛవి
తటిపివెన్నెలతేని ♦ పరువుమాపఁ
గలితమంజీరకం ♦ కణగణారావంబు
ప్రిణవప్రిణాద ధో♦రణులఁ గ్రాల
తే. గీ. సంచిత కృపావిలాస స♦మాదరైక
భాసురాపాంగముల్ కకు ♦ బంతతతులఁ
గలువతోరణములఁ గట్టఁ ♦ గలికినడల
నతనిఁ జేరి కేలంగేలు ♦ ననువుపరచె.

తే. గీ. ఆమె మృదుకరాబ్జస్పర్శ♦మైన తోన
మంత్రి మోహితుఁడగు వాని♦మాద్రి మేను
మరచి యాలేమ యడుగు దా♦మరలచాయ
నడుగులూనుచు నడచెనా ♦ తేఁడు బిరాన.

క. అటు నడచి వివిధవర్ణ
స్ఫుట భవనచయమ్ము దాటి♦పోవుచు నరుణ
చ్ఛట లీను దేహాళిం గని
తుర్రిటిత స్థైర్యుఁడయి తెల్వి♦తో వినయమునన్.

శా. అమ్మా! నీవు నెవత్తైవో యెఱుఁగనా♦యందాదరంబూనుమా
యమ్మంబోలెతలంచుచుంటిని, భయ♦స్వాంతుండఁగాగుణ్యాభా
వమ్మంబూని యొకింతలోన వెలిఁజే♦ర్పంజాగుమానన్ను నో
యమ్మా చూడఁగనోప నీప్రళయదా♦వాగ్నిచ్ఛటల్ కావుమా!

తే. గీ. అనెడు నవ్వానిఁ గ్రీగంట ♦ నరసి సడలు
స్వేదపూర్ణ తదంగుళీ ♦ వితతినొక్కి
పట్టి వైళంబ నడచి యా♦ప్రాంగణమ్ము
దాటఁగాఁ జేయ నతఁడు మో♦దమున నడచె.

ఉ. అంత వినూత్నరత్న నిచ♦య ప్రచురాంతర కాంతి శోభితా
శాంత మనూనసూన కన♦కాంగద భాస విలాసినీ సమా
క్రాంత మశేషవైభవ వి♦కాస సముల్లసితోరు వజ్రశా
లాంతరమందుజొచ్చెనమ♦రాంగనయాతనితో హుటాహుటిన్.

తే. గీ. చలువలకు నూరు చంద్రకాం♦తుల కొటారు
తావులకు రాణ సౌఖ్యంపు♦దారకాణ
కలుములకు పేట సత్యశాం♦తులకు బాట
ధ్యానసమ్మోదలీల త♦ద్వజ్రశాల.

క. ఆ శాలాంతరమున సక
లాశౌఘము మించు రుచిస♦మంచితమై నీ
కాశమ్మై సురగిరికిఁ బ్ర
కాశించెడు మంటపమ్ముఁ♦గనె నతఁడుతమిన్

చ. కరఁగిన పైడిగుబ్బలికి ♦ కైఁగలుపఁ గరుచి చిత్ర చిత్రిత
స్ఫురిత మణివ్రజ చ్ఛవుల♦పూర్వ శిఖిచ్ఛటభంగి భూనభో౦
తరముల నిండ నింగికొన ♦ దాకెడుదానినిఁగాంచి కన్నుదా
మరల మొగిడ్చియాతఁడొక♦మాదిరిచిత్రమునా నిలంబడెఁ.

క. మనమున నొందుతలంపులఁ
జనక ముహూర్తమ్ము మాత్ర♦చనుపిమ్మట న
ల్లనఁగనువిచ్చి కనుగొనెఁ ద
దనూన తేజోంతరమున♦నలరెడు మూర్తిఁ.

సీ. ఆపాద మస్తకం ♦ బపరంజి తళుకులా
తళుకులో చిత్రిలీ♦లలు రహించు
మన్ను మిన్నునొక్క♦ తెన్ను చేయువెలుంగు
లావెల్లు లోనక్ష ♦ రాళికాంతులు
రేయెండ నీరెండ ♦ కాయించుచూడ్కులా
చూడ్కులో జీవరా♦సులు నటించు
ముదురు వెన్నెలజల్లు ♦ మొలిపించు నవ్వులా
నవ్వులో లోక సంతతులు పొడము
తే. గీ. హరి హ రాబ్జజ మౌళి ధా♦ర్యములుశాస
నమ్ము లాశాసనములలో ♦ నవ్యవిశ్వ
తతులు తాండవమాడు ను♦దార కాంతి
కాంతయా జగన్మాతను ♦ గాంచె నతఁడు.

తే. గీ. కాంచి పులకిత గాత్రుఁడై ♦ కరము మోడ్చి
భక్తి వినయప్రమోద తా♦త్పర్యభావుఁ
డై స్తవం బొనర్పఁ గనెంచు ♦ నంతలోన
దేవి యానందమూర్తి య♦దృశ్యమయ్యె.

తే. గీ. సమయవేళాజ్వలచ్ఛిఖా♦చ్ఛటల ప్రభలు
తద్రుచిర మండపస్థలిఁ ♦ దాండవింపఁ
జకిత హృదయుండు నంబికా ♦ స్మరణలోలుఁ
డగుచుఁ గనుమూసె వాఁడు భ♦యాత్ముఁడగుచు.

క. కనుమూసి విచ్చి వాఁ డటఁ
దనదు కుటీరమ్మునందు ♦ తమసమ్ము మృగా
జినమును ఝిల్లీఝిల్లిక
నినదమ్మును కనియె వినియె ♦ నెవ్వగ లెసఁగన్.

తే. గీ. విస్మితుఁడు భీతుఁడును దుఃఖ♦వివశచిత్తుఁ
డగుచుఁ దాఁగన్న స్వప్నవృ♦త్తాంతమెల్ల
తడవుచు నిశాక్షణమ్ములఁ♦ గడపఁ దొడఁగెఁ
గలలు నిజమౌనె? దుఃఖజీ♦వులకు ధాత్రి.

ఓం

శ్రీమత్పరాంబికాయైనమః.

# శ్రీ కళా సిద్ధి



## బీ జ ప్రా ప్తి

తే. గీ. గగన గంగాంగనానురా♦గ ప్రలుబ్ధ
వశత రత్నాకరేంద్రుండు ♦ ప్రణయ చిహ్న
గాఁగ నంపిన మణికందు ♦ కంబనం గ
నట్ట నడిమింటిపై వియ♦న్మణి రహించె.

తే. గీ. భయద మధ్యాహ్నభాస్కర ♦ ప్రభల కులికి
యవనిజ చ్ఛాయలన్ గిరా♦తాఁగనా ప్ర
దత్త వారుణీ పాన మ♦త్తత ననేక
విధులఁ గోయలు విహరించు ♦ వేళయందు.

ఉ. పట్టిన కత్తితో నెడమ ♦ బాహుతలంబున నూఁగువింటితో
జుట్టిన యుర్లతో గడలఁ♦జుట్టెడు చూడ్కులతో శిరంబునన్
గట్టిన పాగతో గరము♦సన్ బెనుబల్లెముతో మనంబునన్
బుట్టిన యాసతో దిరుగు♦బోయ యొకం డట వీస్థలంబునన్.

ఉ॥ కాలునిపోల్కి వాఁడు వెను♦కంజఘటింపక ఘోరసింహ శా
ర్దూల చయమ్మునేని యొక♦గ్రుద్దున డీల్పడఁ జేయువాఁడు, మి
త్రాళి నుతింప నొక్కనిశి♦తాస్త్రముఖంబున నేమృగంబు నేన్
కూలుచు నేర్పువాఁడు మృగ♦కోటికి గుండెకలంగు వాఁడనన్.

ఉ॥ దారులు గాచినాఁడు మృగ♦తండము లెండల నీరుగోరిలు కా
సార తటాగశాఖికల♦చాటున మాటు ఘటించినాఁడు కాం
తార గుహావళుల్ సెమకి ♦ నాఁ డెదఁ గట్టకడన్ నిరాశ వే
సారినవాఁడు వాఁడు మృగ♦శాబక మేన్ బొడగట్ట రామిచే.

క. ఖగచర వనచరముల తో
నఁ గనంబడమి నెదియేని ♦ నాఁడాతఁడు నె
వ్వగనొందుచు నినుఁ డస్తపు
యగిరిం జేరుటయుఁ గాంచి ♦ యడలుచుఁ దనలో.

తే. గీ. అకట యాకలి మంటచే ♦ నడలు చుంటి
నేన, కందువ లేరీతి ♦ నింటనున్న
వారో? యెఱుకు నేగినతల్లి ♦ దారిఁ దొంగి
తొంగిచూచెడు పుల్గు ని ♦ సుంగు లట్లు.

మ. అకటా! యాకలిమంటచేనవసియ♦మ్మా! "బువ్వబువ్వంచు" గుం
డకునై చూచుచు నేడ్చుచున్ బొరలుసం♦తానమ్ము నీక్షింప జా
లక మారొన్మిడి "గ్రుడ్లనీరముల గ్రు♦డ్లన్ గ్రుక్కు కొంచేగు దెం
చిక బాబంచని" బుజ్జగించుసతి నె♦ట్లీక్షించెదన్ దైవమా

చ. కుతికలపాటు డెందములు♦గుంటలు వడ్డకనుల్ క్షుధార్త్తమైఁ
గుతకుతయైన బొజ్జలదిగో ♦ యను నాసల మారిచూడ్కి ను
ద్గతమగు నీటితో నకన♦కం బడుపిల్లలు నన్నుఁజుట్ట, నే
మి తినఁగబెట్టి వారల శ♦మింపఁగఁజేయుదు నేటి కక్కటా.

మ. పాదిలో నంబులు శూన్యమైనను మృగంబుల్ దారికడ్డంబుగా
నాడుగం బోవక వచ్చు నిత్యమును నేఁడో నిర్మృగం బౌచు నీ
యదికన్పించెడుఁ బర్వతోపరి మహోగ్రారణ్యమం దేఁ జరిం
పదు జీవంబొకటైనఁ జిత్రముగ కన్పట్టైఁ జూమీ మర్యాదీ.

తే. గీ. ఎంత పెట్టని దినము నేఁ డెవ్వఁ డెఱుఁగుఁ
బికిలి పిట్టయైనను గాను పింప దడవి
గొడ్డు వోయిన దేమొ? నా బిడ్డల నెటు?
కడుపు చిచ్చార్పి కాపాడఁగలవో దేవ.

తే. గీ. అదియె నాదుకందువుల పేరాకటి సెగ
సంజ కెంజాయ ఛాయ దిక్చయము నిండి
జరఠ భానుస్సైతము మిన్ఁగసాగె నకట
నా కుటుంబదుఃఖంబు శూన్య మగు నేడు.

చ. అతఁ డటు లెంచుకొంచుఁ దన యావలినిం దనయాలి స్వీయదు
ర్గతిఁ దలపోయుచుం జదికిలంబడి నద్దైన లీక్షు చేయుచు
న్న తరుణమందు వానికిఁ గనంబడె నేకల మొందు దూరమం
దతుల దరిద్రతా వ్యథన కబ్బిన పెన్నిధివోలె నయ్యెడన్.

ఉ. ఇమ్మగు చెట్ల నూటునఁ జరింపుచు ముట్టెను భూమి నాన్చి గం
ధమ్ము గ్రహించుచుం దరువి తానమునన్ మెయి రాచుకొంచు వా
లమ్మిరువంకలన్ దిరుగు లాగున ద్రిప్పుచు, ఘుర్ఘురాల్ప నా
దమ్ము నరింపుచున్ నడచు దానిఁ గనుంగొని సంభ్రమంబునన్.

ఉ. లేచి, సితచ్ఛవిస్ఫుట శి♦లీముఖముఁ బలువింటఁ గూర్చి, ల
క్ష్యోచిత దృక్కులన్ నడచు♦చంగలు వెట్టుచుఁ బొంచి పొంచి నా
రాచము నేయ నయ్యది వ♦రాహము గాయ మొనర్చిపోయెఁగా
నీ చదియించపదయ్యెఁ ద్వర ♦ నీప్సితముల్ సమకూరునే ధరన్.

తే. గీ. ఆతఁడాతురుఁడగుట ల♦క్ష్యమ్ము చెడియె
ఘుర్ఘురధ్వానకలిత సం♦క్షోభవృత్తిఁ
బరుగిడఁ దొడంగెఁ గిటిరక్త ♦ మురలుచుండఁ
గంటకచ్ఛన్న గహనమా♦ర్గమున భీతి.

తే. గీ. దాని క్రొన్నెత్తుటేటుల ♦ యానవాలు
బాట నవ్వాఁడు వెన్నంటి ♦ పటుగువారఁ
దొడఁగె నొండునారసమును♦దొడిగి వింటఁ
బ్రాణి వెన్నాడు కాలుని ♦భంగి నంత.

తే. గీ. ప్రాణి భయమున నట్లది ♦ పఱుగువారి
బాట కేవ్రల నొక వేణు♦వనము గాంచి
దానిలో దలఁదాచుకో♦ఁ దలఁచి చొచ్చె
వింతరొద లెల్ల దిక్కుల ♦ వెల్లివిరియ

తే. గీ. పవనహతి నైజమధుర ని♦స్వన మొనర్చు
వేణు వృక్షవితానంబు ♦ వివిధ గతుల
రవములీనె వరాహగా♦త్రి ప్రఘుర్షి
తంబగుచు దాని కంఠ♦నా దమున గలిసి.

సీ. తొలిమొయిళ్ల ని నాద♦ములలోనఁ గేకికే
కారవము లయించి♦ యాడినట్లు
మలనుండి డిగవాఱు ♦ సెలయేటిపాటలో
గలుఁజు నిధ్వానమ్ము ♦ కలిసినట్లు
చివురుమేపరి కుహూ♦రవములో గాకంబు
స్వీయధ్వనులు మేళ♦వించినట్లు
అలలపైఁ దూఁగురా♦యంచగానములోనఁ
గొదమతుమ్మెదరొదల్ ♦ గూడినట్లు

తే॥ గీ॥ లలితవల్లకీ స్వానమి♦ళన్నిలింప
నర్తకీపాద మంజీర ♦ నాదమట్లు
లా మధురనిస్వనమ్ములో♦ నలముకొనియెఁ
గిటిచటుల ఘుర్ఘురీకవి ♦ స్ఫుటరవంబు.

తే. గీ. అటు జనించిన రవము, త♦త్ప్రాంతమందు
ధ్యాన నిర్మగ్నుఁడైన యు♦తథ్యు చెవులఁ
బడియె షోడశప్రణవ సం♦ పన్నిధాన
మైన వాగ్బీజమగుచు న♦త్యద్భుతముగ

క. తన వీనుల వడ నదియ
ల్లనఁ గన్దెఱచి కిటిఁగాంచి ♦ రవ మొదవిన, తె
న్ను నెఱిఁగి తద్బీజంబును
మననం బొనరింపఁదొడఁగె ♦ మహితశ్రద్ధన్.

తే. గీ. అంత కంత కుత్సాహమ్ము ♦ సంతసమ్ము
తన్మయత్వమ్ము దోఁప డెం♦దమ్ము నందుఁ
దాఁ గలంగన్న చిన్మూర్తి♦ తాండవింప
నిశ్చలానంత కాంతుల ♦ నియతుఁడగుచు.

క. మననంబొనరుప నదియే,
మను వను భావమ్ముఁదోఁప ♦ మదిఁ దిరమై ని
ల్చినమూర్తిఁ దలంచుచు మను
వను చుండఁ గిరాతుఁ డ తని ♦ యంజ కరిగి వే.

తే. గీ. బాబు ఏకలమొండు దె♦బ్బతిని పాఱి
వచ్చె నియ్యెడ కెందేగెఁ ♦ బలుకుమయ్య
యాలు బిడ్డ లాకట నింట ♦ నడలుచుండి
రనిన విని మాని పల్కమి ♦ నతఁడు తిరిగి.

క. నాయాలుబిడ్డలకు నా
కీయసువులు నేడు నీవ ♦ యిచ్చిన యటులౌ
నాయడవి పంది పోయిన
చాయలు పలుకంగదయ్య ♦ జాలి మనమునన్.

చ. అనఁగనువిచ్చియాతని యు♦దంతముసాంతముగాగ్రహించినె
మ్మనమున నెట్లుపల్కుటకు♦మైకొన కొక్కటజీవహింస యిం
కనొకట సత్యబాధ యెది ♦ కర్జ మికేవిధి వీనిఁబంపఁగాఁ
జను ననుసందియంబునవి♦చారణసల్పుచుఁగన్నుమూయుచున్.

తే. గీ. సత్యవాగ్ధోరణియు నహిం♦సావ్రతంబు
నీ స్వరూపంబు లని వేద ♦ నిచయమాడు
నంబికా యిప్పుడేది క♦ర్జంబొ నాకుఁ
దెలుపు మంచు నతండు ప్రా♦ర్థించు నంత.

తే. గీ. సర్వవిద్యాప్రదంబు బీ♦జాక్షరంబు
అతని శ్రవణేంద్రియంబుల ♦ నంటె నపుడె
కరతలామలకము లౌచుఁ ♦ గళలు వాని
జ్ఞానిఁజేయ రెండిటిఁబ్రోచు ♦ సరణి నెంచి.

క. "కాంచునది పల్కలేద, వ
చించెడు నది కాంచలేద? ♦ యెత్తెఱఁగున నీ
కించ వ దల్చెద" నంచుఁ బ
ఠించెను శ్లోకంబు నతఁ డ ♦ హీనాశువుగాన్.

తే. గీ. ఆ నుడులు వించు బోయ య♦హో యటంచు
నాలు పురిటాలు వెదురు బి♦య్యమ్ము కూడ
చిక్కవీ మాపునందున ♦ నిక్కమింక
మముల నాకలి సెగ మారి ♦ మసఁగు నేడు.

తే. గీ. బతుకు బాగ్గెమ్ము మాకున్న ♦ బమ్మనేడు
పక్కనేఁ జిక్కనీయక ♦ పందినిట్టు
లలుగునకు తప్పచేయునే ♦ యక్కటకట
తలంచుఁ జదికిలఁబడు బోయ ♦ నరసి మౌని.

క. వీఁడాకలి వడి నటులు
న్నాఁడక్కట పీనిఁగావ ♦ న్యాయము, నాకె
ట్లాడిన నటుయిటొ హింసయె
మూఁడు ననుచుఁదోఁచుచుండెఁ♦ బో యనిచింతన్.

ఉ. అందరికీవ తల్లి వి క♦దా జగదంబిక యొక్కపుత్రి నా
నంద మయాత్మఁజేసి యొక♦నందనుదుఃఖినిచేయుచుందు వే
మందు సముద్ధరింపఁబడ♦డా తొలిజన్మమునందుఁ బాపఁపున్
జందము జీవి, యీభవము♦న న్నిది ధర్మ మటమ్మయంబికా!

మ. అకటా ! గుంటలువడ్డకన్గవలలోఁ ♦ బ్రాణమ్ముశోషింప, నె
మ్ముకలన్ బేర్చినభంగిమేన్ గనికర♦మ్మున్ గూర్పగాఁ గోచిపా
తకు నేన్ నోచుకొనంగఁ బోవని దరి♦ద్రిప్రాణిలోకమ్ము పా
లికి నేదిక్కును చూప వేమిటికి త♦ల్లీ విశ్వసంరక్షణీ.

క. అని యంబనెంచి చింతిలి
కనికరమున వానిఁగాంచి ♦ క్షణముండుమ యిం
దని, చని దుంపలఁ గొన్నిఁటిఁ
గొని వచ్చి మృగయునకిచ్చి ♦ కూర్మి మెయికొనన్.

క. ఈదుంపలచే నాకలి
బాధనడఁపు నేఁడు నీదు ♦ భార్యాదులకా,
మోదంబొందెద రేకద
యేది లభించినఁ ద్వదీయు ♦ లెల్లరుఁ బంతా.

తే. గీ. అను నుతధ్యు వాక్కులకు గ♦త్యంతరమ్ము
లేమి ప్రత్యుత్తరంబీక ♦ లేచి దుంప
లను గ్రహించి, భక్తి మెయిఁగ ♦ రమ్ము మోడ్చి
యా కిరాతుండు గీమున ♦ కరిగె నంత.

తే. గీ. తన కనూహ్యమ్ముగా లభిం♦చిన తదక్ష
రప్రభావమ్ము హృదయ సా♦రసమునందుఁ
దాండవంబాడు మూర్తి చం♦దమ్ము పులకి
తమ్మయిన మేనుఁ దలఁచి స♦త్యవ్రతుండు

మ. తలఁపంగాఁ, బదిమారు లబ్బురముగా♦ దైవారె ఛందఃకలా
కలితాలోకము శ్లోక మొక్కఁడిదె నా♦ల్కన్ దాండవం బాడెని
ర్మలమంజీరరవప్రభూతనిగమా♦ర్థ శ్రేణి బ్రహ్మాణి హృత్
స్థలి రాణించెడు తేజమూర్ధ్వగతి కు♦త్సాహించె నొక్కత్తుగాన్.

చ. కరుణయె మూర్తిఁ గైకొనిన♦కై వడిఁ గన్బడె స్వప్నవీధి ని
క్కరణి నిమిత్తమాత్రముగ ♦ కల్పనచేసి రవమ్మునీ మహా
క్షరము ననుగ్రహించి, సహ♦జప్రతిభా ప్రతిమాన శాస్త్ర వి
స్తరసరస ప్రశస్త కవి♦తాసతిఁ గూర్చెఁ బరాంబయే కదా.

ఉ. కానఁదదక్షరార్థము ల ♦ ఖండజగజ్జన నీస్వరూప క
ళ్యాణగుణ ప్రగుంభిత మ♦యంబులు స్వాత్మకళాపరిహర్ష సం
ధాన లసన్ముముక్షు జన♦తావరణీయము లౌటఁ దత్తపో
ధ్యానమె మన్మనస్థితప♦రాంబికలోననుఁ గల్పఁజాలెడున్.

## సాక్షాత్కారము

క. అని తలఁచి గాంగజలముల
మునిఁగి యథావిధిగ సంధ్యఁ ♦ బొనరిఁచి గాయ
త్రి నెదన్ జపించి యాచెం
తన గిర్యుపరిగహాన లలి♦తనికుంజమునన్.

తే. గీ. అమలపద్మాసనా సీనుఁ♦డగుచు నింద్రి
యముల నియమించి ప్రాణమ్ము ♦ నాగి కుంభ
కమున నాసికాంతమున దృ♦క్తతి ఘటించి
స్వప్నమునగన్న దివ్యరూ♦పము దలంచి.

ఉ. రేకులహేమరోచులు ప♦రిభ్రమణస్థితిఁ గర్ణికాంత రా
స్తోకతటిల్లతాద్యుతుల ♦ తోఁగలియన్ బ్రణవారవంబు న
ప్రాకృతమై చెలంగఁదన♦ రారు హృదంబుజమందు స్వర్ణదు
ర్గాకృతి స్వప్నమందుఁగని♦ నట్టులునిల్పి, తదేకచిత్తుఁడై.

క. ధారణఁ జేయుచు మనమున
నారాజద్విజజపని♦యతుఁడై ద్వంద్వా
కారములన్ మఱచి తదే
కారాధకుఁడై యెసంగె ♦ నవ్వాఁడంతన్.

చ. చెదరదులోనిచూడ్కి, హృది♦ జెన్నలరారుపరాంబమూర్తియున్
గదలదు, తన్మహాక్షరము ♦ కైవసమై రసన న్నటించు, స
ళ్లదు, పవనమ్ము కుంభకపు♦ రాయిడిఁ జంచలమింత లేద, యా
సదమలచిత్తు పుణ్యాకవ♦శంబున సాజములయ్యె సర్వమున్.

ఉ. సారకళాప్రకాశములు ♦ చాటుచుఁ దజ్జగదంబ దీప్తతే
పారి విచిత్రకాంతి హృద♦యమ్ము విశుద్ధ నతిక్రమించి వి
స్ఫారతరాజ్ఞ నిల్పి రవి ♦చంద్రహుతాశన రోచులన్ సహ
స్రార సరోజములన్ గలసి♦ రాజిలఁ గాంచె నతండు నిష్ఠమై.

తే. గీ. కాంచి తన్మయుఁడగుచు జ♦గమ్ము మఱచు
తరుణమందున నత్యద్భు♦తముగ హృదయ
జలజమునఁ గ్రాలు కాంతి పుం♦జమ్ము లెల్ల
కరుడు గట్టిన భంగి ముం♦గల నటింప.

తే. గీ. అతఁడు వెఱగంది హృదయ సం♦స్థిత పరాంబి
కాద్యుతిన్ డెందమునిచి క♦న్గవల విచ్చి
యెదుట వెల్గు తళుకులో న♦నేకగతుల
మురువులీను చేర్పడరాని ♦ మూర్తి నరసి.

సీ. అఖిలవిద్యల కాది♦యైన తన్మంత్రార్థ
మీతేజమంచు నూ♦హించునొకట
పుంస్త్రీనపుంసక♦ముల కభేదముగూర్చు
తొలి వెలుంగిది యంచుఁ ♦ దలఁచునొకట
శ్రితసంచయమును నుద్ధ♦రించువేళ గుణమ్ము
గను నిర్గుణమిదంచుఁ ♦ గాంచునొకట
నబ్జజాబ్జాక్షాద ♦ లాబ్జమౌళులు పుట్టు
తెఱఁగిదే యంచుఁ జిం♦తించు నొకట

తే. గీ. సర్వమును దానయై సర్వ • సాక్షిగాఁ డ
నరి జగన్నాటక ప్రతా • నమ్ము నడపు
సూత్రధారిణి యిదియంచుఁ • జూచు నొకట
హృదయమున బైటఁ దత్కాంతి • నెంచి యతఁడు.

తే. పులకితాంగుండు తత్వప్ర • బోధితుండు
నిర్మలుఁడు నిశ్చితుఁడు యోగ • నియతుఁడగుచుఁ
గనుగవల మూసి విచ్చెడు • క్షణములోన
వెలుఁగు లన్నియు నేకమై • నిలిచె నందు.

సీ. తతకిరీటవిచిత్ర • తచిరత్నరోచులు
వదనాబ్జమున వింత • పసలనీనఁ
బ్రతిపదిందు హాసించు • ఫాలకుంకుమ రేఖఁ
గస్తూరికాతిల • కంబెసంగ
నతుల రత్నాంగద • ద్యుతులఁ గేళ్లఁ దనర్ప
వివిధాయుధచ్ఛవి • వియ్యమాడఁ
గటిసూత్ర మణిసము • త్కటకాంతిహారనా
యక రత్నదీప్తులు • య్యాలలూఁగఁ
తే. గీ. పదసరోజమంజీరప్ర • భల నఖాగ్ర
రుచులనేపారఁ గరుణావ • లోకనమ్ము
లమృతమున్ జిల్క, హరితురం • గమము నెక్క
కనకదుర్గాభవాని సా • క్షాత్కరించె.

తే. గీ. తన్మహామూర్తి సరసి చై ♦ దములఁ దొఱఁగి
తన్మయస్థితి నొక్కింత ♦ తడవు పుచ్చి
పిదప తెలిసి హర్షాశ్రువుల్ ♦ వెడలమ్రొక్కి
గద్గదగళుం డతండిట్లు ♦ గా నుతించె

మ. ఘనసృష్టి స్థితినాశ శక్తి, త్రిజ♦త్కళ్యాణసంశక్తి, ని
త్యనిరాకార నిరీహాశక్తి, బహిరం♦తర్వ్యాప్తచిచ్ఛక్తి, నా
ద నిధానామలశక్తి, జీవనివహా♦ద్యంబౌ "పరాశక్తి" స
త్యనిరూఢాంచితశక్తి, నీవకద మా♦తా! స్వర్ణదుర్గేశ్వరీ.

అమలంబాద్యమచింత్య మవ్యయమమే♦యానందమాద్యంతశూ
న్యమశోకంబనఘంబనామయమనూ♦హ్యాంబప్రమేయంబనూ
నమనిర్వాచ్యమచంచలంబఖిలమా♦మ్నాయాగ్రరాజత్కళా
ర్థమసంగంబగుమూర్తి నీవకద మా♦తా స్వర్ణదుర్గేశ్వరీ.

తే. గీ. ఎవఁ డహంకృతి వీడి ని♦న్నే సమస్త
జగముగా గాంచుచుండు నా♦సత్వమూర్తి
నీవగుచు నెల్లభంగుల ♦ నెసఁగుదంట
యట్టి కళ్యాణమిమ్ము నా♦కనయ మంబ.

క. నిను హృదయకమల కర్ణికఁ
గనుఁగొని యర్చనలొనర్చి ♦ కైమోడ్చి కుమా
రునివలెఁ జనుబాల్ గ్రోలెడు
చనవరి తనమొప్పు నాకొ♦సంగుము తల్లీ.

క. మునిశాపకీలి కీలల
మనుగడ వీడ్వడి యడంగు ♦ మందుని నను నీ
యనుపమ కరుణామృత వీ
చిని దేలించుచుఁ గృతార్థుఁ♦ జేసితి తల్లీ.

తే. గీ. బంధు దుర్గంధుఁ, బాప సం:బంధుఁ జ్యుతని
జాన్వయోచితకర్ము, హీ ♦ నాత్మధర్ముఁ
బ్రథితసమ్మూర్ఖు, దుర్గుణ ♦ ప్రౌఢు, వీనిఁ
గరుణఁ గాంచుట కన్న న♦బ్బురము కలదె.

శా. అంబా దుర్గ, పరాంబ దుర్గ, జగదం♦బా దుర్గ, నేదుర్గ, నె
య్యంబాదుర్గమదీయదుర్గయనినా♦ట్యంబాడుచున్ బాడుచున్
సంభావించుచుబిల్చుచున్ బలుకుచున్ ♦ ధ్యానించుచున్ నీస్వరూ
పంబందున్ ననుఁజేరనిమ్ము కరుణా♦పాథోధి దుర్గేశ్వరీ.

ఉ. ఎత్తరుణంబునందును న♦శింపని ప్రాబలు కేని నీకుఁ గ్రొం
గ్రొత్తనుతుల్ ఘటించుట నె♦ఱుంగదు నేనరుఁడన్ జడుండ వా
యెత్త స్వతంత్రభావ మొక♦టేనియుఁ దోపది కే మొనర్తు నే
నిత్తు గ్రహింపుమమ్మ జగ♦దీశ్వరి నాయను నట్టిదంతయున్.

చ. మినుపలకన్ బయోనిధి స♦మృద్ధమషిన్ సురశాఖి లేఖినిన్
గొని పలుకు న్నెలంత త్వద♦నూనదయాగుణ వర్ణనక్రియం
బొనరుప సాగినన్ సొలసి ♦ పోవునె కాని కృతార్థయత్నయై
తినని ముదంబునందు నెను♦తింపఁగ నేర్తురె? నిన్నుఁ దక్కొఁచుల్.

మ. అని కన్నీరది కాల్వలై యురలఁగా నంబా పరాంబా మదం
బ నను న్సాకుమటంచుఁ బంకజసుధాపానప్రమత్తాళియో
యనఁ దత్పాదములందు వ్రాలెను తదేకాయత్త చిత్తప్రవృ
త్తిని లీనంబయి యాతఁడంతట దయాదృక్సార మేపారఁగన్.

క. కరకంకణగణసు ప్రీణ
వరవంబాశలఁ జెలంగ వదనస్మితరో
చి రహింప వాని యాదలఁ
గరమిడి దీవించె భక్తకామద యటు పై.

తే. గీ. ఖరకరసహస్రకిరణ విస్ఫురణరోచి
నవహసించు తేజంబొకండందెసంగ
నతఁడు స్మృతినూని కనువిచ్చి యగ్రమందు
నంబికాకృతి లేమిలో నడలువాఁడను.

మ. జగదంబా! జగదంబ! యంబిక యదృశ్యంబైతివో నన్ను నే
లఁగ నూహింపవొ యీదరిద్రునకు మార్గం బేమి చూపించి నా
వాఁగరాసుండని త్రోయనెంచితో? నెపంబుల్ డొల్లనేమో యికే
వగ నెన్నాళ్ళకుఁ గానవచ్చెదొ? పరాంబా! యంబ! దుర్గాంబికా.

మ. చనుబాలిమ్మని పోరు వెట్టితినొ? సీ చంకెక్కఁగా నేడ్చి నా
డనొ! మారామొనరించినానొ? నినుఁ బాటల్ పాడుమా యంచు, గు
జ్జనకూళ్ళన్ దినిపింపుమంటినొ! యికే "చాదస్తపున్" గోర్కెలన్
నినునొప్పించితినో! కుమారువలె నన్నీక్షింపు మంచాడుచో.

కాకా బ్రహ్మ హరీశ్వరుల్ కొడుకులై ♦ గారాన నాపాద నా
ళీకం బంటి నుతింతురా సుమహిత ♦ శ్రీనందకీయజ్ఞుఁడే
లాకై ముట్టె మదంఘ్రులంచెద నదృ♦శ్యంబైతో! లోఁగి సక్కనేఁ
రేకెత్తించి ననుం ద్వదుత్తమకళా♦లీనాత్మఁ గావింపుమా!

క. ఈ పసరముతో నేమని
యీ పగదిని కన్నులంగి ♦ తేనీయు నీ వీ
పాపుని కేదిక్కు దయా
వ్యాపారం బుజ్జగింప ♦ నగు నేతల్లీ.

శా. నా కన్నీరు స్రవించి గండములపై ♦ నన్ జారికల్ తీర్చి తా
మై కట్టెన్ గరుడుల్ దిగంతర పరి♦వ్యాప్తంబులై గాలిలోఁ
బ్రాకెన్ హృద్గత గద్గదారవము లే♦లా! చూచియున్ జూడన
ట్టీ కాలంబున మిన్నకుండెదవు త♦ల్లీ స్వర్ణదుర్గేశ్వరీ.

క. అని భక్త్యున్మాదము లోఁ
బెనఁగొనఁగాఁ గానవచ్చు ♦ విపినం బఖిలం
బును దుర్గాంబాకృతిగాఁ
గనుపడఁ దన్మూర్తిఁ దిరిగి ♦ కాంచు తలఁపుమై.

తే. గీ. భావనా బలంబునఁ బరాం♦బా స్వరూప
మన్ని తావుల నిలిపి స♦త్యాకృతి యను
భ్రాంతితో నాస్థలంబు జే♦రంగఁ జనుచు
హా! యనుచు నేడ్చు నద్ది శూ♦న్యంబుగాఁగ.

తే. గీ. అట్టు లేడ్చుచు నంబ యం♦బా యటంచు
మాటికిన్ బిల్చుచున్ బ్రతి♦మాలుకొనుచు
వేడుచున్ గంటకావృత♦విపినవీథిఁ
బడి తపింపఁదొడంగె నా♦పావనుండు.

సీ. కన్నీరు కాల్వగాఁ ♦ గారి చారికఁ గట్టఁ
గోము రడంగిన కపో♦లములతోడ
నుదయాది గ్రుక్కెడే ♦ నుదకమ్ముఁ గ్రోలమిఁ
దడియారు "నాలుక ♦ పిడుచ" తోడఁ
గంటకప్రతతి మై ♦ గాడి గీరుటఁ జాలు
వారెడు శోణిత ♦ ధారతోడ
ముండ్లు నాటినఁ గంది ♦ పొక్కిక్కినడచెడు
క్రమము దూలించు పా♦దముల తోడఁ

తే. గీ. గనులు కనరాని కటికిచీ♦కటిని జగము
మఱచి యంబ! యంబా! యంచు♦నరచుచుఁజనెఁ
దన రవంబె దిక్కులఁబ్రతి ♦ ధ్వనులనీనఁ
గంటకారణ్య భయద మా♦ర్గమున సతఁడు.

మ. అతఁ డా భంగి నవస్థఁదూలుచు స్వకీ♦యాంగంబులం దంచిత
స్థితి తప్ప న్నొకచోటఁ గూలఁబడి లో♦దీపించు దుర్గాంబికా
కృతి నందున్న సమస్తవస్తువులలో♦నీక్షించుచున్ దన్మయో
ద్ధత భావంబున జొక్కు వేళల వియ♦త్కంజాక్షి యిట్లాడెడున్.

వత్సా! యేమిటి కిట్లు లేడ్చెదవొకో♦ ప్రత్యక్షమై యంబ నిన్
వాత్సల్యంబునఁ దేల్చి యాశిషమిడెన్♦ వాంఛావళుల్ తీర్చి దీ
వ్యత్సాహిత్య కవిత్వతత్త్వముఖ వి♦ద్యావ్రాతముల్ కూర్చి, యు
ట్లుత్సాహంబును వీడ నానొకో కవి♦త్వోద్యోగివై క్రాలుమీ

ఉ. చేసినచేతకుఁ ఫలము♦ చెందక పోరెవరేనిఁ దొల్త వి
ద్యా సముపేతుఁ జేయుమని♦ ప్రార్థనఁ జేయుటఁ గాదె దివ్యవా
గ్భాసుర బీజమిచ్చి కవి♦వర్యునిచేసెఁ బరాంబ నిన్ను నీ
వీ సరణిం దపింపఁ జనునే కవి♦వై యశమందుమా సుతా!

తే. గీ. తొలుత జనిలోని వగు కర్మ♦ ఫలము లెల్ల
ననుభవించి కవీంద్రుండ♦వై రహించి
కడకు కలసెద వంబి కా♦ కారమందు
నను నుడులువించు కటకటా♦ యంచు నతఁడు.

ఉ. అక్కట! దుర్లభంబు భవ♦దంఘ్రి సరోరుహ దర్శనంబు స
మ్యక్కృప మైయొసంగియుఁ ద్వ♦దాకృతిలోఁ గలుపంగఁ బోవకీ
ఫక్కిఁ బురాకృతంబుఁ గుడు♦వన్ వలె నంచన నేమొనర్తు నే
దిక్కు గలారు నాకు జగ♦దీశ్వరి నీవయిటుల్ ఘటించినన్.

తే. గీ. అని విషాద బాష్ప కణాబ్ధు♦ లందుఁ దోఁగి
మఱచి సర్వంబు నంబ! యం♦బా! యటంచు
ధాత్రిజచ్ఛాయఁ గూలె న♦తండు, కర్మ
వార్నిధి తరింపఁ జాలిన ♦ వాఁ డెవండు?



ఓం

శ్రీమత్పరాంబికాయైనమః

# శ్రీ కళాసిద్ధి



## రాజసమావేశము

తే. గీ. అది, మహాటవి మధ్యంది ♦ నాతిచండ
కర కిరణఘాటి కోడి మృ♦గ వ్రజంబు
లవనిజచ్ఛాయలందు, గు♦హాఘమందుఁ
గుటికవెట్టెడు తరుణ, మా♦తరుణమందు.

శమితాఖేటుఁడు, ఘర్మబిందుగణ సం♦సక్తాస్యుఁడా రణ్యఘో
ర మృగానేక గళ స్రుతాస్రకణ ధా♦రా రాజితంబైన ఖ
డ్గమువాఁ డాచలితాత్మవాల నిహతో, త్క్రాంతారదంశ్రవ్రజో
త్తమగంధర్వుఁడుదార వేషుఁడుమహీ♦దారుండొకం డయ్యెడన్.

గంగాశీతలవారి దప్పి నడపం♦గా, భూమిజ చ్ఛాయ కూ
ర్పంగా జల్లదనమ్ము దెమ్మెరల నా♦రన్ జెమ్మటల్, పీడఁదీ
ర్పంగా మెత్తని లేత పచ్చికబయల్ ♦ వాహ్యాళిజశ్రాంతి పా
యంగా నాతఁడు తత్తటిప్రకృతి లీ♦లానంద మూహింపుచున్.

సీ. మసృణ మోహనకళా ♦ మాన్యమీ లేత ప
చ్చిక తిన్నెయే రంగ ♦ సీమకాఁగ
భువన పావన న వాం♦భోరుహామోదమీ
సురవాహినియె, సరో♦వరముకాఁగ

లలిత గైరికచిత్ర ♦ కలితమౌ గిరికంద
రంబె విహారస్థ♦లంబుకాఁగ
ఫుల్లమల్లీ రజ♦స్స్ఫూర్జితం బీ నికుం
జంబె శయ్యామంట♦పంబుకాఁగ

తే. గీ. నాడి పాడుచుఁ, దోయమ్ము ♦ లాడుకొంచుఁ
గ్రిమ్మఱుచుఁ గూర్కుచుం, బ్రమో♦దమ్మెసంగ
సహజ గణ్యలావణ్య ప్ర♦శస్త, ప్రకృతి
బాల యీకానలో, కేళిఁ♦దేలునేమొ ?

సీ. కాకున్న, సెలయేటి ♦ కలికి యెవ్వారికై
పాటఁబాడుచు వీణ♦మీటఁ దొడఁగుఁ

గాకున్న, విరిదీవ ♦ కన్నె యెవ్వారికై
క్రొత్తా వి,గమి గు బు♦ల్కొన నటించుఁ

గాకున్న, మాధవీ♦ కాంత యెవ్వారికై
చలువ పూచొప్పడ ♦ మ్ములురచించుఁ

గాకున్న, జంచరీ ♦ కసతి యెవ్వారికై
పూఁదేనె వాఁకలఁ♦బోది చేయుఁ

తే. గీ. గానిచో, నిత్యమవని జాం♦గనలు ఫల వి
తానములఁ గరశాఖల ♦ నూని నిలుచు
టేరికై రసవత్కళా♦సార విహృతిఁ
బ్రకృతి కళ్యాణి, యిటనిల్వఁ♦బడని యెడల.

తే. గీ. ఎవరు నీగ్రోసిపెంచి రీ ♦ యవనిజముల
నెవరు పందిరులఁ దీర్చి ♦ రీలతాళి
కెవరు సొబగులు విరచించి ♦ రీ సుమవ్రి
జంబులకు, నంబికా విలా♦సంబు, దక్క.

క. అని భూపుం డరు సంబున
మునుఁగుచు నాదరి నొకింత♦పోయి ప్రకృతి శో
భను దిలకించెడు నెడ నా
తనిదృష్టి గిరిపయి కేగు ♦ తరుణము నందుఁ.

తే. గీ. ఎండఁ గందియుఁ దెమ్మెర ♦ యెమ్మెగాని
వలపు చెయ్యికి నీవలా♦వలకు నూఁగు
ప్రియఁపుఁ దీవ కన్నె యీా ♦ రంబునందు
మనుజుఁ డొక్కండు చూపట్టె ♦ మనుజపతికి.

తే. గీ. అట్లు చూపట్ట నతఁ డెవం♦డన్న బుద్ధి
సూక్ష్మదృష్టిఁ బరీక్షించి ♦ క్షోణిపుండు
వాని నిశ్చలయోగస♦ధానుఁడనుచు
నిశ్చయ మొనర్చి, భక్తిమై ♦ నెమ్మనమున.

క. మును పెన్నండిట నీయనఁ
గనినది లేదెచటివాఁడొ ♦ ఘనతర తేజం
బు నరయ మహానుభావుం
డని తోచెడు నంచునచటి ♦ కరుగఁ దలఁచుచుఁ.

క. కరవాలాదుల భృత్యుని
కరముల కందిచ్చి ♦ భక్తి, కౌతుక వినయ
స్ఫురిత మనస్కుండయి, భూ
వరుఁ డాగిరినెక్కె, మాని♦వరుఁ గన్గొనుచున్.

సీ. నొసటఁ గుంకుమ రేక ♦ పసదనమ్ము రహించెఁ
బరమేశ్వరీదయా ♦ పాత్రుఁడేమొ ?
మై నిట్ట నిడుపుగా ♦ మలపినట్లగుపించె
స్థిరపంకజాసనా ♦ సీనుఁడేమొ ?
నెవ్యోమము దామర ♦ నిగ్గు దిక్కుల కెక్కె
నిత్య జితేంద్రియా ♦ నీకుఁ డేమొ ?
కనుఁగవల్ ముకుళించు ♦ కరణిగా దైవారె,
నిశ్చల నిధ్యాన ♦ నిరతుఁ డేమొ ?

తే. గీ. చిఱుతగాలికి నెఱికురుల్ ♦ చిందులాడె
మోమునన్, నూత్నమౌనివరా♦నేమొ ? యదిర!
శ్మశ్రుశూన్యంబు చుబుక మిా ♦ శాంతమూర్తి
పూప పాయమ్ము వాఁడెకా♦బోలునేమొ ?

తే. గీ. అని తలంచుచుఁ గడు విస్మ♦యంబు తోడ
నల్లన నికుంజమును జొచ్చి ♦ యతని కెలన
ముకుళిత కరాబ్జుఁడై తేఁడు ♦ మ్రొక్కినిలిచెఁ
బావనంబయ్యె, మామక ♦ భవమటంచు.

తే. గీ. అంబికాపాద కమల రో♦లంబ మీతఁ
డంబికా దయాలబ్ధ వి♦ద్యా నిరూఢ
భావుఁడీతండు కాకున్నఁ ♦ బట్టపగటి
యిను నపహసించు తేజ మిం♦కెవని కుండు.

అనియూహించుచు భక్తివిస్మయవశ♦స్వాంతుండు భూమీశుఁడా తని, దైవంబుక్రియంగనుంగొనుచు ను♦ద్యన్మోదముఁ జెందుచుం డి,నిమేషంబటులొక్కజాము గడపన్ ♦ నిధ్యానముం బాసి, యా సనముం ద్రోసియుతథ్యుఁడా నృపతినీ♦క్షన్ జేయభూపాలుఁడున్.

క. వినయము, భక్తియు సంభ్రమ
మును బెనఁగొనఁగఁ బ్రణామ♦మును బొనరిచి, పై
కొన నడఁకువ మోడ్పుల నిలువఁ
గని ముని యిటులాడె వింత ♦ గదిరినమదితోన్.

రాజవు, రాజలక్షణ వి♦రాజితమూర్తివి, యిట్టి కానకే
వ్యాజము,బూనివచ్చితి? భ♦వత్పుర మెయ్యది, నామమేది, ని
స్తేజుని నన్ గనుంగొనఁగఁ ♦ జిత్తము నందెటు తోఁచె నీకు, నీ
యోజసమస్తముం దెలుపు మోయియనన్నృపుఁడుం బ్రియంబునన్

క. పురి, మౌళి వియద్గంగా
తరంగ శీకర తతి దురి♦త మడఁచు హరు కా
పుర, మగు కాశీపురి, యు
ర్వర నంబాధాసుఁడనెడు♦వాఁడ యతీంద్రా.

ఉ. క్రూర మృగ వ్రతానముల♦కున్ దలకందివ పాటు లెల్ల“రే
పారఁగ మమ్ము, గావుప్రభు♦వా యనికుయ్యిడ నేగుదెంచి,య
వ్వారలగోడుమాన్ప,మృగ♦వారముఁదోలి,శ్రమమ్ము వాయనీ
తీరమునన్ జరింపఁ భవ♦దీయ మహాత్తరమూర్తి,కన్పడెన్.

తే. గీ. చిఱుతగాలుల కిటు నటు ♦ చెదరు చున్న
తీవ గమిలో వెలుంగు మీ♦ తేజ మరసి
భవదు దారసందర్శన ♦ భాగ్యముదక్కెఁ
జిన్మయపదంబు నంద వ♦చ్చితి, వశీంద్ర.

ఎన్నో యేఁడులనుండి యీయటవికే♦ నేతెంచుచున్నాఁడ,నా
కన్నుల్ గల్గిన లాభ మిప్పటికిగా♦కన్పట్టెఁ, ద్వత్పాదధూ
ళి న్నాశీర్షమునన్ ధరించుటఁ గృతా♦ర్థీభూతభావుండ నై
తి నోముల్ ఫలియించెఁ బావనుఁడనై ♦తిన్ జుమ్ము వాచంయమీ.

ఉ. మున్నుమహాత్ములైనముని♦ముఖ్యులఁగొందరఁజూచియుంటి న
త్యున్నతతావకీన మహి♦తోత్తమ తేజముఁబోలు తేజమే
నెన్నఁడుఁజూడ, మత్కలుష♦మెల్లనడంగె,మనంబు జ్ఞానసం
పన్నతనొందె, దర్శనము♦మాత్ర నికే మనుదున్ వశీశ్వరా.

కం. అను నానృపవరు వినతా
ననమునఁ జూడ్కులు నిలిపి, మ ♦ నంబున నే యో
చనయోచేయుచు, నిట్టూ
ర్పున వాని కనెముని వగపుఁ ♦ బూనిననుడులన్.

క. ఏదిక్కు నే నెఱుంగని
యీ దౌర్భాగ్యుని నుతింప ♦ నేటికి నృప, నీ
వేది తలంచితొ, యది సుం
తే దొరుకదు వీనిచెంత ♦ నేగుము పురికిన్.

తే. గీ. జ్ఞానమెచ్చట భక్తిసం ♦ ధాన మెచట
ధ్యానమెచ్చట, మోక్ష ని ♦ ధానమెచట
యే నెచట తేజ మెచట, ను ♦ తింపవలవ
దణు సహస్రాళి నే నొక ♦ యణువుఁ జుమ్ము.

తే. గీ. అనెడు మునిమాట లాలించి ♦ మనమునందుఁ
బరమ యోగసాధకుఁడగు ♦ బ్రహ్మమయుఁడి
తండని తలంచి, నృపుఁ డు చి ♦ తం బెఱింగి
యిట్లనియె మృదులోక్తుల ♦ నెలమి గదుర.

క. పురి తలఁ దన్నుఁ బ్రశాంతికి
నిరవౌట వనంబు, నేను ♦ నెటు లేగుదుఁ ద్వ
చ్చరణాంబుజ మధుపాన
స్ఫురిత హృదళిఁ ద్రిప్పఁజాలఁ ♦ జుమ్ము మునీంద్రా.

క. పస గలుగులోకసుఖములఁ
గొసరెడు పాయమున నొందు ♦ గోరక, యోగా
భ్యసనముగల మిము గన నా
కసదయ్యెను లోకపాల ♦ నాదులు దేవా!

మ. అదియుఁ గాక, పరాంబికాచరణ ని♦త్యధ్యాన పారీణ సం
పదలన్ రాజిలు తావకీన పదయు♦గ్మంబెంచు మోదంబు క
న్న దురంతప్రభుతాస్మయాత్మతధరన్♦బాలించుటానందమా
నె? దయాపారగ యానతీయు మిటనే♦నిల్తున్ భవత్సేవకై.

క. అన దరహాసం బాస్యం
బున కొక చెలు వీయ ధరణి♦పు, లెదల నెప్పుడై
నను, నిటు యోచింతురె భా
గ్య నిధానుల కేటి కిట్టి♦కష్టములు, నృపా.

ఒక వేళ న్నినుఁబోలు వారు గలరే♦నుద్యత్ప్రభుత్వాంచిత
ప్రకటస్వాంతులు, ధర్మనిష్ఠులగుచున్♦బాలించు టర్హంబకా
దె, కుమారుల్ తమయంతవారయి, ధరి♦త్రిన్ దాల్చునందాక, భూ
ప కులోత్తంసమ కాననస్థలి వసిం♦పన్ వచ్చునే, మాగతిన్.

తే. గీ. వాసనాబద్ధ మైన భా♦వమున నొక్క
తఱి ననూహ్యమ్ముగ విరాగ♦దశఘటిల్లి
నను, నిలువలేదు విత్తు నా♦టిన క్షణంబ
పూయునో, కాయునో తెల్పు♦మో? నృపాల.

క. మును ముందుగ మదిఁ గల వా
సనల నడఁచి సిద్ధగురు వ♦చనముల, సందే
హ నికాయము దోఁగియుచు సా
ధన చేయఁగ వలయు, మోక్ష♦తత్పరుఁడు నృపా.

క. అపు డెందుండిన ఫల మొ
క్క పద్ధతి మెయిఁ బొడఁగట్టుఁ ♦ గావున నార
ణ్య పరిభ్రమణ భ్రాంతి, వి
డి, పురి కరుగుమీ నృపా క ♦ డింది ముదమునన్.

క. అనవుడు, విన్నదనంబును
వినయంబును మోముకళల ♦ వెల్లివిరియ, జో
తనిడుచు, భూపుండు వినుం
డని, యిట్లనె వానిమాన ♦ సాబ్జము కరగన్.

క. భాసుర మూర్తింగల, కై
లాసము, శివ మౌళి శశి వి♦లాసము, సుఘనో
ల్లాసము, కాశీపుర మా
వాస మగుట నిట్టిచింత ♦ వాటిలె దేవా!

క. హరుఁ గొలువ వచ్చెదు మునీ
శ్వరుల నరసి వారిసేవ ♦ సలుపుదు సతమి
క్కరణిని మది మారదు, త్వ
చ్చరణ మహత్త్వంబు నుడువఁ ♦ జాల, వశీంద్రా.

తే. గీ. గోచిపెట్టిన దాడిగాఁ ♦ గువలయాధి
పత్య దుర్గర్వభావన్ము ♦ పాలవితతి
దురిత తాప మెట్లార్చుఁ ద్వ ♦ చ్చరణకమల
నిస్స్రుతామృత కణపాన ♦ నిరతిఁగాక.

లాలిత రాజ్యపాలన వి ♦ లాస వినోద సుఖైక వీచికా
మాలలఁ దేలియాడుటఁ గ్ర♦మమ్ముగ నబ్బాయఁపఁ బ్రొద్దొకింత కై
వ్రాలిన మమ్ముఁబోంట్లు వన♦వాటులనుండ ననర్హులైన వోఁ
బోలునె? యేమిటన్ దనియఁ♦బోవని కుత్తుల కీ గతుల్ ప్రభూ.

తే. గీ. తావులు గుబుల్కొనఁగ, మరం ♦ దం బెసంగ
గంధ వహుఁ డొజ్జగాఁ దేటి ♦ గానములకు
నల్లన నటించు, క్రొవ్విరి ♦ యర్చనలకుఁ
దగునుగాని, పసరుమొగ్గ ♦ తగునె? దేవ.

క॥ అని యేమో యనఁబోయెడు
జనపతిఁ గరసంజ్ఞ నాపి ♦ సంయమి యేమీ!
ముని సేవ్యంబౌకో? కౌశిక
వినుచుము తన్మహిమనాఁగఁ ♦ బృథ్వీంద్రుఁ డనున్.

ఉ. అందుఁ జెలంగుచుండు, హరు♦ నాదలనుండు నదీపురంధ్రి, త
న్మంద తరంగ రంగ నట ♦ నక్రమ శైత్యకుమార మారు తా
నంది నితాంత పాపుఁడయి ♦ నన్ సురరాజ్యరమావినోద సం
బంధ వనీ విహారములఁ ♦ బాల్గొనువాఁడగు సంయమీశ్వరా

సీ. వెలయ వచ్చును గాంగ♦వీచికా సోపాన
ముల ఖలుండేని స్వ♦ర్భువనమందుఁ
గదియవచ్చును నీల ♦ కంఠుఁ గొల్వఁదలంచు
కుజనుఁ డేనియు ముక్తి ♦ కోమలాంగిఁ

బొందవచ్చు సదాన్న ♦ పూర్ణామహాదేవిఁ
గనుదరిద్రుండేని ♦ కామ్యవితతి
నందవచ్చును, మహా ♦ నందకాననవాసి
యగువాడు, ప్రళయమం♦దైనముదము

తే. గీ. నట వినంబడు నెవ్వాని♦కైన, సాంధ్య
సమయ తాండవ నటరాజ ♦ చరణరణిత
రత్నమంజీర నిగమఘో ♦ షారవంబు
లందుఁగలవాఁడె శాశ్వతుఁ♦డగును దేవ.

అది, యిదియంచునేల కొని♦యాడగ నందలిజీవి యెయ్యదే
ని, దివిజనాథుఁ బోలు, ధర♦ణీతలరేణువు, దైవతాద్రిఁ బో
ల్పఁదగు, విరించిముఖ్య సుర♦వర్యుల కంచితసేవ నీయ మ
య్యదనఁగ, దానికింగల, మ♦హామహిమఁ బుదలంపుమా ప్రభూ.

తే. గీ. తొలుత జనిఁ బుణ్యశతములు ♦ సలిపి నట్టి
ప్రాణి కవిముక్తమున నుండు ♦ భాగ్యమబ్బు
నొరుల కబ్బదన నతిశ ♦ యోక్తి కాదు
కాంచిన నెఱుంగ వచ్చుఁ దత్ ♦ ఖ్యాతి దేవ.

చ. అన విని తత్పురిం గను ప్రి♦యంబు మనంబున సందడింప, మా
వనమున కెంతదూరము భ♦వత్పుర మంచనమాని, తేఁడు, పొం
గినమదిఁ జిక్కఁబట్టి పరి ♦ కింపఁగజాలెద రెల్లి వీనివెం
ట, నిపుడవచ్చి రేని, ముని♦నాథయనన్ విని యాతఁ డాత్మలో.

క. నరవరుల కూర్మి తిరమై
వరలదు, పులి విశ్వసించు ♦ భంగినయగు నా
క్కఱుఁడ నయిపోయెద హరుని
చరణాబ్జ మరంద మాని ♦ చరితార్థుఁడఁగాన్.

క. అని తలఁచి నరపుఁ గనుఁగొని
యఃఘూ కాశీ మహత్త్వ ♦ మని ధన్యాత్మున్
బొనరిఁచితి ననుఁ గృతజ్ఞుఁడఁ
జనుమా, సైరించి యింత ♦ జాగున కనినన్.

తే. గీ. పెన్ని ధానంబు గనినట్టి ♦ పేదచంద
మొంది యున్న భూపాలుని ♦ యుల్ల మతని
వినయములఁ గలఁగగ దైన్య ♦ మును వహించి
యెలుఁగు రాల్పడ నిట్లని ♦ పలికె నతఁడు.

శా. నాదైవంబవు నీవ, యిట్టులనగా ♦ న్యాయంబె మాసింద్రి, నీ
పాదాంభోరుహచంచరీక మదయ ♦ త్వంబోర్వదెం తేన్ ద్వదా
జ్ఞాధారంబున సంచరించి భవ ♦ జాడ్య శ్రేణిఁ దూలింప నీ
మై దైవారెడు నగ్గివోలు నుడిఁజి ♦ మ్మన్ జాలితేలా! ప్రభూ.

తే. గీ. నెనరు దనుపార వలసెడు ♦ పనులఁ గొనుచు
ననుఁ గృతార్థుని సలుప యో ♦ చనలొనర్పఁ
డిందు నే నందు నేని యిం ♦ కెందు నేని
భృత్యు కడనిట్టి వినయమ్ము ♦ లేల? దేవ.

తే. గీ. తలఁపు గలిగిన శంకరు ♦ దర్శనమ్మొ
నర్ప, నీదాసుఁ గొని ప్రయా♦ణంబు సలుపు
డటులు గాదేని వీని ని♦చ్చటన నిలుప
నెంచుడంచుఁ గేల్మోడిచి ♦ నృపతి నిలువ.

క. విని ముని చింతించుచుఁ గట!
వినయుఁడు సాత్త్వికుఁడు భక్తి ♦ వెలయించెడు నీ
తని మది నొప్పించితి భూ
ప నికాయములోన మంచి ♦ వాఁడుండరొకో.

ఉ. ఈతనివెంట నేగుటన నేమగు ♦ గంగ మునింగి యాశ్రిత
వ్రాతము నుద్ధరించెదు, పు♦రాణ వధూవర పాదపద్మ సం
జాత మరందపాన సుఖ♦సంగతిఁ దేలి సుపర్వులన్ మనః
ప్రీతిగఁగాంతు సంతసిలు ♦ తేఁడును నాకుతుకంబుదీరెడున్.

తే. గీ. అంచు లోనెంచి, నృపుఁ గాంచి ♦ యనఘ యెందు
విధిఁ దలఁపనేల! కాశికా ♦ విశ్వనాథుఁ
డంపెఁగాబోలు నిన్ను న♦న్నాత్మఁ బ్రోవఁ
గాన నన్నందుఁ జేర్పు వే♦గముగ ననిన.

క. చిత్తంబని తనకొరకా
యత్తులునై చూచుచున్న ♦ యనుచరులకు న
త్యుత్తమ మగు డోలికఁ దే
నొత్తి పలికి మౌనిఁ జేరి ♦ యొడయండు నతిన్.

క. ఆందోళికఁ జూపించుచు
నిం దుపవిష్టులయి మీర ♦ లేతెంచుడు మే
మందరము హాయంబుల మీ
దం దముఁ గొల్చినడతుము మనఁ ♦ దబిసి ముదమునన్.

తే. గీ. లేచి, యాందోళిక వసింపఁ ♦ బృథ్వీధవుని
యానతి హుటాహుటి నడల ♦ నరుగఁదొడఁగి
రెల్లవారు నుతధ్యుండు ♦ హృదయ సీమ
నంబికా ధ్యాన మగ్నుఁడై ♦ యలరుచుండ.

క. అటు నడచుచు ధరణీ భృ
త్పటల తటి న్యటవిమార్గ♦తతి గడచి మహా
నటు కటక నికటమున కు
ద్భటవేష్టిత మాని, రాజ ♦ వరు లరుదెంచన్.

సీ. చటుల సంధ్యా మహా♦నట దివ్య తాండవా
లోలానుకూలరా♦గా లవనమొ ?
జహ్నుకన్యా తట♦స్థలశాద్వలవిహార
నందికేశ్వర గళా♦నందరవమొ
ప్రత్యహాశ్రిత జన♦ స్తుత్యార్థదస్ఫుర
దన్నపూర్ణా కంక♦ణా క్వణనమొ
కాశీశ్వర ప్రసా♦దాశయోన్మత్త భ
క్తవరావళీ గద్గ♦దస్వనంబొ

తే. గీ. నిరతకేళీవినోద వి♦స్ఫురితదంతి
ముఖకృతోరు ఘీంకృతి నాద♦మో యనంగ
వారి వీనుల పండువు♦గా రహించె
గగన గంగానదీతరం ♦ గారవంబు

క. ఆ రవము చెవులపండువ
గా, రారాజు మునిఁ జేరి♦కౌతుకమగ్న
స్ఫారాంచిత రోమాంచలుఁ
డై రావం బాలకించి ♦ రా? యని వినతిన్.

సీ. ఆ రవ స్వరవీధి ♦ ననుకరించియె సామ
వేదంబు నుద్గాత ♦ వితతి పాడు
నా స్వానమే యీశు♦నవసర కార్య సం
దోహంబు నచ్యుతా♦దులకుఁ జాటు
నా ధ్వానమాలించి ♦ నంత కాలభటౌఘ
హృత్కోశవిసరముల్ ♦ ప్రిదిలిపోవు
నా నినాదానంద ♦ మనుభవించిన ఘోర
నిరయార్హుఁడును ముక్తి♦తరుణిఁ జేరు
తే. గీ. నా ప్రణాదాంతరంబున ♦ నవతరించె
నఖిల శబ్దాధ్వ గణము బ్ర♦హ్మమయమగుచు
నయ్యదే భక్తకోటి కా♦హ్వానమంపు
గేయ గంగా రవం బాల ♦ కింపు దేవ.

సీ. త ద్వీచి కారావ♦తతి వీనులకుసోక
నెవఁడేని విబుధన ♦ దృశతనొందుఁ
దచ్ఛీకరస్పర్శఁ ♦దనరెనా యెవ్వఁడేఁ
శంకరధ్యాన హా♦ర్షమున దోఁగుఁ
ద చ్ఛీతలోర్మ్ములఁ ♦ దలముంచెనా యెట్టి
ఖలుఁడేనిఁ గిన్నరాం♦గనలఁబొందుఁ
ద జ్జలం బొకమాటు♦ త్రావెనా జనుఁ డెవ్వఁ
డేఁ కాప్య గిరిపథం ♦ బెఱుఁగ గలఁడు

తే. గీ. త త్ప్రివాహంబునఁ బిత్రు ♦ తర్పణాది
లన దనుష్ఠాన నిష్ఠాప ♦ రత్వావ్యాదయు
లెల్ల లీనమై పోవుదు♦రీశు నంద
యదియె మందాకినీనది ♦ యరయుమయ్య.

క. అని విన్నవించి చాలై
కనుపించెడు సౌధ వన వి♦కస్వర సితకే
తన తతుల నిరూపించుచు
జననాయకుఁ డిట్లు పలుక ♦ సాగె నతనితో.

సీ. ఆ సితచ్ఛవి భవ♦నౌఘంబు లది కాదు
సర్వేశ్వరుని మేని♦చాయ గాని
యా వనంబులు పురో♦ద్యానంబులా కావు
శివ పదాంకిత వన ♦ శ్రీలుగాని

యా పతాకావళు ♦ లవ నీందు ్రలవి కావు
గగన కిన్నరుల ప♦క్షములు గాని
యాదుందుభిధ్వాన ♦ మస్మదీయము కాదు
భైరవేశ్వరు మహా♦భేరిగాని
తే. గీ. యా గుములు మానవులు గారు ♦ వారుని సేవ
సలుప వేచియుండిన వియ♦చ్చరులు గాని
కాదు కేవల మర్త్యలో♦క ప్రశస్త
పురవరం బిది ముక్తికా ♦ పురము గాని.

సీ. ఇంకెందుఁ జెలువారు ♦ నీపురంబున గాక
పృథు దయాత్ముండు వి♦శ్వేశ్వరుండు
ఇంకెందుఁ గనవచ్చు ♦ నీపురంబున గాక
యాశ్రితేచ్ఛా పూర్ణ ♦ యన్నపూర్ణ
ఇంకెందుఁ బాఁడగట్టు ♦ నీపురంబున గాక
కలుషాపహా తరంగ ♦ గగన గంగ
ఇంకెందుఁ దైవారు ♦ నీపురంబున గాక
ప్రళయ సన్నిహితుండు ♦ భైరవుండు
తే. గీ. ఎందు నొప్పారు నీపుర ♦ మంద కాక
నత విబుధ మండి తుండు వి♦నాయకుండు
ఎందు వర్తించు నీపుర ♦ మంద కాక
మధుముఖాసుర భేది♦రమా వినోది.

పులకితగాత్రుఁడై జనవి♦భుండిట్లు పల్కుచు, నీరుదేర, క
న్నులను,నమశ్శివాయ,సుమ♦నోహర నాగవరాంగదాయ య
త్యలఘుకృపాతరంగితహృ♦దంబురుహాయ నమోస్తటంచు, ని
స్తులతర భక్తిపూర్ణ వివ♦శుండయి, గద్గద నిస్వనంబునన్

నిను,గాంక్షించిన దేమనంబు,తమి ని♦న్వీక్షించుకన్నుల్ కనుల్
నినుఁబూజించు కరంబె తా, కరము, ని♦న్నే పల్కు నా నాల్క నా
ల్క,నినుంజేరఁగవచ్చు నడ్గు లడుగుల్ ♦భావంబునన్ నీకృపాం
బు నిధిన్ మున్గిన వాఁడు వాఁడయగుశం♦భూ! విశ్వనాథప్రభూ.

అని కన్నీరిడు పార్థివుంగని పరాం♦బా, నీవగా యిట్టి రీ
తిని విశ్వేశ్వరమూర్తివై చెలఁగి తెం♦తేనంచు డెందంబునం
దున,దుర్గాకృతిఁగాంచి తన్మయకళా♦నూనప్రమోదంబునం
దె నుతథ్యుం డటులుండఁగొంతవడికిన్ ♦జేర్వ్యోగంగాతటుల్.

తే. గీ. అట్లు గంగా తటింజేరు ♦ నంతలోనఁ
గువల యాధీశ్వరున కెదు♦రొక్కలు నెఱప
వేచియుండిన యుద్యోగి ♦ బృందములు ఘ
టించు నతులు మన్నించి, పృ♦ధ్వీందుఁ డెలమి.

## కా శీ ప్ర వే శ ము

సీ. గమ గమ తావి న♦ల్గడలఁ జిమ్మగఁ జాలు
సలలితారామ సం♦చయము దాటి
కాశీపురీసతీ ♦ కటిమేఖల యనంగ
నలరారు జహ్నుక♦న్యకను దాటి

యరసినంతటన య♦చ్చెరుపాటు చేకూర్చు
తోరంపు విపణి వీ♦థులను దాటి
వెలకు సాధ్యముగాని ♦ నెలరాల గుములచేఁ
దళుకీను మేటి సౌ♦ధముల దాటి

తే. గీ. పనితనంబు బెడంగును ♦ పఱపు గలిగి
కళల కిరవై చెలంగు శా♦లలను దాటి
సిరికి నశ్రాంత విహరణో♦చితములైన
భవనముల దాటి నడచె న♦వ్వారి గూడి.

సీ. పటహాకాహళముఖ ♦ స్ఫుట నినాదంబిలే
శ్వరు పత్తన ప్రవే♦శమ్ము దెలుఁప
నిజ బృంహితధ్వాన ♦ నియతి భద్రగజేంద్ర
తతి రాజ దర్శనో♦త్సవము దెలుప
లలిత హేషారావ ♦ కలితోత్తమహయంబు
లవనీధవుని విజ♦యంబు దెలుప
శ్రుతిహితఁబుగ శుక♦ప్రతతు లంతఃపురాం
గనలకు విభునాగ♦మనము దెలుప

తే. గీ. వినయ వినమితగాత్రులై ♦ విభు లమాత్యు
లును కుమారకుల్ హితు లెదు♦ర్కొనఁ గడింది
ముదము రేకెత్త నవ్విప్ర ♦ పుత్రు తోడ
నగరుఁజేరె, ధరాంగనా ♦ నాయకుండు.

తే. గీ. చేరి, మణిపీఠిఁ దబిసి నా♦సీనుఁజేసి
వట్టమహిషి నీరముఁబోయఁ♦ బసిడిపళ్లె
రమున నడుగులు కడిగి, య♦ర్ఘ్యాదివిధుల
నర్చ సల్పి, తదాజ్ఞఁ దా♦ నధివసించి.

పౌరలు నమాత్యవర్గమును♦తుల్ హితుల్ బరివారముల్ దనుం
బరిసరవర్తులై కొలువ ♦ వారలకున్ మునిఁ గాన్పుఁజేసి యీ
వరముని నాదు పుణ్య పరి♦పాకమునన్ జనుదెంచె మీరలం
దరు వారునిన్ భజించెదు వి♦ధంబున నియ్యనఘున్ భజింపుఁడీ.

శా. నా రాజ్యంబును నా ధనంబులును నా,♦నానావిధ ప్రాభవ
ప్రారంభంబులు నెల్ల వారలవి త♦త్పాదాభిషేకార్చనా
స్ఫారానందుఁడనై చరించుటకుభా♦వంబందు నూహింతు నం
చా రాజన్యుఁడనన్ మునీంద్రుఁడనుఁదా♦ రగ్గింపగా నెల్లరున్.

ఉ. ఓనరలోకపాల, తగు♦నో యిటులాడఁగ, రాజ్యపాలనా
నూనవిధానమేడ, యతు♦లుండు విధానము లేడ, నేడనో
కాననసీమలందు నిలు♦గట్టిన నాకితరార్థమేల, నే
దేనికి మీదుపీటి కరు♦దెంచితినో తలపోయుమా మదిన్.

ఉ. తాయనకారకం బఘుని ♦ తారక మూర్తిహరంబు జన్మజ
న్మాయత శోకకానన ద♦వానల మక్షయమోక్షకామినీ
స్ఫాయి దనూన హాసపరి♦వర్ధిత మీశు నివాసమంచు, నీ
వామెడనాడ వచ్చితిఁ జు♦మయ్య, జగత్పితలన్ గనుంగొనన్.

తే. గీ. అంతియేగాని రాజ్య మ♦హావిభూతు
లందఁగాఁ గాదు కావున ♦ నభ్రగంగ
మునిఁగి విశ్వ మాతాపిత♦లను గనంగఁ
బోవువాఁడను, పంపింపు♦మో నృపాల.

చ. అన[illegible] లాధవుండు, విన♦యంబున, దేవరవారి కిచ్చ వ
చ్చినయటులుండవచ్చు,వన♦సీమయొకండుశివాలయంబు,చెం
తనగల దభ్రగంగయును♦దాపగునయ్యెడ కందునుండి,మా
కనిశము తావకీన చర♦ణాంబుజసేవ, యొసంగుడీ దయన్.

క. అని యాతని యానతిమెయి
ననుచరయుతుఁడై యతిని ని ♦ జారామంబం
దు, నమల సౌధంబున భ
క్తిని చేర్చి వలసినవెల్లఁ ♦ గీలించి నతిన్.

తే. గీ. వీరలు కుమాళ్లు- సచివుల ♦ వ్వారు వార
లా ప్రజనులెల్ల వేళ మీ ♦ యర్చ సలుప
నిలిచియున్నారు భవదిష్ట♦ముల వచించి
యాదరింపంగదయ్యా, ద♦యన్ మహాత్మ.

క. అన భూవుం డంగీకృతిఁ
గనఁబరచి నృపాలు నరుగ♦గా సెలవిడి, యో
గ్యుని బ్రాహ్మణు నొక్కనిఁదో
డ్కొని గంగమునుంగ వాని- కుంజరుఁడు పనెన్.

ఉ. గంగ మునింగి, దైవత ని♦కాయమునం దోక్షరుండనై శిసం
చుం గుతుకంబుచెంది చని ♦ శూలినిజాలయసీమఁ జొచ్చి త
ల్లింగమునం దపూర్వమగు♦ తేజముఁ గన్గొని విస్మయంబుతో
డంగయి మోడ్చి, తద్రుచినె♦డందఘటించి, యతండు నెమ్మిమై.

ఉ. ఆకలిఁగొన్న బిడ్డడు ర♦యంబునఁ దల్లిని చేరుమాడ్కి, లో
కైక శరణ్య, నాశ్రితజ♦నావనచిత్తసరోజ, నన్నపూ
ర్ణాకృతిమై రహించెదు, ప♦రాంబికఁజేరి నమస్కరించి, తా
నాకవి, మైగగుర్పొడువ ♦ నాశువిధిన్ వినుతించె నీగతిన్.

విసువక పైడిగిన్నె నులి ♦ వెచ్చనిపాయస మాశ్రితాళి పం
తసము వహించునట్లు సత ♦ తంబునొసంగుచు నేది కోరినన్
గొసరినఁదక్షణంబ యొడఁ♦ గూర్చెదు గుక్కెడునీరమేని యా
నిసుఁగున కీయుమమ్మ జన♦నీ శ్రితలోకహితప్రదాయినీ.

సీ. పసిఁడి పంటలలోని ♦ కసటూడ్చి తెలినిగ్గు
లేపార నన్నంబు ♦ నేర్పరించి
విరిదేనె వాకల ♦ వితములూని శ్రీమమ్మ
వాయఁగా జేయు పా ♦ సీయమొసఁగి
కమ్మతెమ్మెర విహా ♦ రమ్ము నూర్పులఁ జిమ్మ
పొలపు మాపుచు ప్రాణ ♦ సుఖముగూర్చి
తలచు నాల్కలరుచుల్ ♦ గుఱుతించి తొలుదొల్త
రకరకాల దినుసు ♦ లను ఘటించి

తే.గీ. తఱుగుటెఱుఁగని భువన స ♦ త్రింబహంబు
నలవరించెదు నాగోడు ♦ లాలకించి
కవళమొక్కటి నీచేతఁ ♦ గలిపియిడుము
దాసుఁడ క్షుధార్తుఁడను విశ్వ ♦ ధాత్రి జనని.

సీ. ననుఁగృతార్థునిఁ బొనర్చిన ♦ భవత్కల్యాణ
రూపమింకొకసారి ♦ చూపుమమ్మ
నాపాపరాశి ప ♦ టాపంచలై పోవ
నభయహస్తంబు నీ♦ యంగదమ్మ
నా జన్మజన్మతృ ♦ ష్ణాగ్నులారగనేడు
జనవుమైఁ జనుబాలొ ♦ సంగుమమ్మ
నాకెట్టిపుట్టువే ♦ నీకింక నీచిద
ఖండతేజంబులో ♦ గలుపుమమ్మ

తే.గీ. అమ్మ, యమ్మా, యటంచు నే ♦ ననెడు వేళ
ఆఁ యనుము, ఓ యనుము నాకు ♦ నంతెచాలు
నమ్మ, నీపాలఁబడిన న♦న్నరయుమమ్మ
యక్కటిక మూనుమమ్మ మా ♦ యమ్మ దుర్గ.

క. నిగమశిఖావినుతంబు, త్వ
దగణితమహిమైకభూతి ♦ నభినుతి సేయ
న్నగునే, యొక నరునకు నీ
యగతికుని సముద్ధరింపు ♦ మా జగదంబా.

తే. గీ. అంచు వినుతించి, యన్నపూ♦ర్ణాంబికాకృ
తిం గనకదుర్గ దీపింపఁ ♦ బొంగిపొరలు
జ్ఞాన వీచులఁ దేలుచు ♦ చనియె నతఁడు
బ్రహ్మమయునకు నాల యా♦ర్చనము లేల.



ఓం

శ్రీమత్పరాంబికాయైనమః.

# శ్రీకళాసిద్ధి



## కాశీవాసము

తే. గీ. అట్లు వనమున కేగి మ♦ధ్యాహ్నసమయ
కృత్యము లొనర్చి, త ద్వన ♦ శ్రీని గాంచి
భావ ముప్పొంగఁ బుల్కరిం♦పంగ నొడలు
సృష్టి చిత్రంబు నెంచి యీ♦రీతిఁదలఁచె.

సీ. ఘన రత్నఖచిత సౌ♦ధనివాస మేటికీ
భవతాప శమ పంచ♦వటి మెలంగ
శశికాంత మణి మయా♦సన సౌఖ్య మేటికీ
లలిత శాద్వల వేది ♦ కల వసింప
వివిధాన్నపానాను ♦ భవభోగ మేటికీ
స్వాదుసౌరభ ఫల ♦ సమితి మెసవ
మసృణ కాషాయ వ♦స్త్రసమూహ మేటికీ
తత మహీరుహపత్రి ♦ తతి ధరింప
తే. గీ. నేల రాజ కృచుపచార ♦ కృత్యము లిట
శాంత సమ్మోద సత్త్వ ని♦సర్గమంజి
మ పరిభాసుర ప్రకృతి సీ♦మంతినీమ
తల్లి సాధుసంసేవ సం♦తత మొనర్ప.

ఉ. రెమ్మ నలంగకుండఁ బువ్వు♦ రేకు లొకింతయుఁ గందకుండ జుం
జుమ్మని కర్ణికాంతర ర♦సోదయ నాళమెటింగి, లోమరం
దమ్మనయమ్ము గ్రోలు నళి♦తండము చెంగట నేర్తు, పర్వశా
స్త్రమ్ములలోని సారమొక♦సారిగ గ్రోలఁగఁజాలు నైపుణిన్.

మురువు, మృదుత్వమున్, సరసమున్ దగు స్వేచ్ఛయుఁ దన్మయత్వమొ
క్క రకముగాఁ జెలంగ, నిజ♦గాన మరందకణ ప్రసాద పం
భరిత దిగంతరం బగుచు ♦ భాసిలు కోయిల నాకుఁ బ్రేమమై
గురువగుఁ గాక సత్కవిత♦కున్ దలఁపూనెదు నట్టి వేళలన్.

క. అనుచు సమస్తవనమ్మును
గనుఁగొని తపమున్ బొనర్చు ♦ కౌతూహల మా
త్మను నెక్కొనఁదగు నీర
మ్ము, నొక్కచో నరసి భక్తి♦పులకిత మతియై.

క. మణిభవన వసతి యేటికి
ప్రణుతామర మౌళిరత్న ♦ భాసురచరణా
రుణదుర్గాంబ, వనాకా
రిణిగా దైవారె నవ్య♦రేఖల నపురా.

అని హర్షాశ్రువు నించు నయ్యవసరం♦ బందా నృపుండేగుదెం
చి నతిన్ జేయ శివార్పణం బని ♦ తమిన్ జేరంగ రాఁబిల్చి జ
మ్మునికన్యామహిమమ్ము శంకరుకథాపూర్వాహంబు దుర్గాంబికా
ఘనకారుణ్యమహత్త్వమున్ మిగుల వక్కాణించి యాపిమ్మటన్

ఈ వనియే పరాత్పరు న♦హీన నిసర్గ విలాస మోహన
శ్రీవిలసిల్లఁ జేయుచు హ♦రింపుచుఁ దాపములన్ ప్రశాంతవి
ద్యావిభవంబుఁ జాటెడుఁ జు♦మా యిటనే తపముల్ బొనర్పఁగా
భావమునన్ దలంచెద నృ♦పాయన వించు నతండు భక్తిమై.

క॥ వినయమున, మదఖిలము న
ర్పణ మొనరించితిని దేవ♦రకు మున్న భవ
న్మనమునఁ దోఁచిన భంగిన
పొనరింపుడు నన్ గృతార్థుఁ ♦ బొనరింపఁ బ్రభూ.

తే॥ గీ॥ అను నృపాలుని యానన ♦ మందు చూడ్కి
నిలిపి చిఱునవ్వు దొంతరల్ ♦ జెలఁగ దీని
నాశ్రమము సేయ హృదయమం ♦ దభిలషించె
దే? యనఁగ మౌని విని యట్ల♦నే యటంచు.

క॥ శాంతుల ననుగుణుల విరా
గాంతరితస్వాంతుల విమ♦లాచారుల న
త్యంత మతని సేవకిలా
కాంతుండట నిల్పె భక్తి ♦ గౌరవ మతిమై.

తే॥ గీ॥ అటు నిలిపి యాజ్ఞఁ గొని భూపుఁ ♦ డరుగ నరుస
మందుచున్ జెంతఁ గలవారు ♦ డెంద మొత్తఁగి
చేయు సేవల సంతుష్టి ♦ చెందుచుండె
ననయ మొక్కొక్క భంగి స♦త్యవ్రతుండు.

సీ॥ అర్చించుఁబో యనా♦హాత సారసమునందు
స్వర్ణదుర్గాంబ ను ♦ మస్సులందుఁ
దోఁగుఁబో సురనదీ ♦ తోయంబులను జగ
న్మాతృభావమునఁ బ్రి♦భాతమందు
వినుతింపనేగుఁబో ♦ విశ్వేశ్వరాన్నపూ
ర్ణాలయంబులకు స్నా♦నాంతమందుఁ
జేరుఁబో వనికాజ్ఞఁ ♦ జింతించి యంబికా
మంత్రినిధ్యాన స♦మాధి మునుఁగుఁ
తే॥ గీ॥ బ్రికృతి యెజసంజచాయలఁ ♦ బ్రిబల శ్రీద్ధ
దేవి హృదినిల్ప పూజించి ♦ దివ్యభావ
నాబలంబునఁ దద్దర్శ♦నంబొనర్చి
తన్మయుండై చరించు స♦త్యవ్రితుండు.

తే. గీ. అతని, నిత్యసత్యవ్రితం ♦బతని దీక్ష
యతని, భక్తివిజ్ఞానమ ♦ హాత్త్వకలిత
వర్తనంబు, విరాగవ్రి ♦ భావ మనతి
కాలమందున వీటి న♦ల్గడలఁ బ్రాకె

జననీ యంచని యేడ్చు నొక్కతరి యు♦ష్మదూప్రిపమందెప్డు, గ
ప్పను యోచింతువను నొకప్పుడెద స♦ర్వాం బంబికాలీల యం
చనిభాషింపఁదొడంగు నొక్కమరి న♦త్యానందబాష్పాంబువా
స్త్రినిమగ్నుండయి యంబతోఁబలుకు ను♦ద్రేకంబు నన్నొక్కెడన్

తే. గీ. దినములోక కొన్ని యీభంగిఁ ♦ జనఁగ మరల
నిశ్చలతపఃపరిభావనం ♦ దీప్తినంబ
నరయు కోరిక మదిఁబొంగి ♦ పొరలుచుండ
గాఢ నిష్ఠాత్ముఁడై మౌని ♦ క్రాలునెడల.

సీ. క్రోలు,బో యొకగ్రుక్క ♦ పాలు సై మరుపాటు
జారెనా చెంగట ♦ వారలోసఁగ
మెసవుబో యొకపండు ♦ విసువుతో నొడలెఱిం
గిన వేళల సమర్థ ♦ జను లోసంగఁ
గుడుచుఁబో యొకముద్ద ♦ తడబాటుతో మేను
తెలిసిన భక్తులు ♦ గలిపి యొసఁగ
నానుఁబో నీరమ్ము ♦ నరచూడ్కితో బొంది
యున్నట్లు లెంచెనా ♦ యొరు లోసంగఁ
తే. గీ. దడవి మూచూచు నోలమ్ము ♦ దగ గ్రహించె
నేని మధుర రసంబులు ♦ నృపుఁడొసంగ
నతుల గాఢసమాధి మ ♦ యాంతరంగుఁ
డై జగంబెల్ల మఱచి స ♦ త్యవ్రతుండు.

ఉ. కూరుకుసున్న, తిండియనఁ ♦ గూడదు, మాటలు లేవు, లేచుటన్
దారివాఱుశక్కి, దోఁగుటని ♦ నన్నహా, చూడ్కులతీరు వేరు, శా
రీరము శుష్కమైన నొక ♦ రీతి, మహత్తర తేజ మాననాం
భోరుహ మందెసంగు ముని ♦ పుత్త్రుఁ డనూనసమాధిమున్గుచో,

తే. గీ. అట్టు లాతండు యోగ మ ♦ హత్త్వపథము
నందుఁబడి లోకమెఱుఁగని ♦ చంద మొంది
మాసములు మూఁడుపుచ్చిన ♦ మరుదినంబు
నందుఁబ్రత్యక్షమయ్యె ♦ దుర్గాంబ మరల.

తే. గీ. అట్లు సాక్షాత్కరించిన ♦ యంబఁగాంచి
పులకిత శరీరమున బల్కు ♦ పలుకలేక
కలితనిశ్చేష్టుఁడై మోడ్చెఁ ♦ గరము లంత
యంబికాదేవి, కరుణ ని ♦ ట్లాన తిచ్చె.

ఉ. ఓయి కుమార కైతల మ♦హోజ్జ్వలకీర్తిగడింపుమోయి య
త్న్యాయత మామకీనపద ♦ తామరసంబులఁ గొల్వవోయి నీ
వేయెడ నేని, నన్ను జపి♦యించిన వేళలఁ గానవత్తు నో
యీయిక దీక్షవీడి చరి♦యింపఁగదోయి ప్రసన్నముద్రతో!

తే. గీ. కడకు నా తేజమందునఁ ♦ గలియుదోయి
నావలెనె, యాశ్రిత ప్రతా♦నముల కెల్ల
వలయు కామ్యంబులన్ దీర్పఁ ♦ దలఁపుమోయి
యంచు దీవించుచు నదృశ్య ♦ యయ్యె నంబ.

తే. గీ. అంబిక యదృశ్యయైన దే♦హం బెఱింగి
యామె యానతి నెంచి, క♦ర్మానుభవము
నకుఁ దపించి నేమమువీడి ♦ ప్రకటశక్తి
భక్తి సర్వజ్ఞుఁడై, మాని ♦ వరుఁ డెసంగె.

సీ. విన్నపంబు గ్రహించి ♦ పృథ్వీవరాస్థాన
మున కేగు నర్వావా♦హనము నెక్కి
శాస్త్రార్థవిదుల క♦సాధ్యశాస్త్ర రహస్య
సంగతుల్ వాకుచ్చు ♦ క్షణములోనఁ
బండితకవులు, వి♦భ్రాంతినొందఁగ నాశు
ధారాకవిత్వత♦త్త్వమ్ముఁ జూపు
యోగీంద్రుఁ డీ మహా♦భాగుండనుచు మ్రొక్క
నెల్లవారల దయ♦నీక్షచేయ

తే॥ గీ. నవనిపుంభావమైన, దు♦ర్గాంబయనుచు
రాజవర్యుండె కాదుపో ♦ రాజ్యమొకడె
కాదుపో, సమస్తాశలఁ ♦ గలుగు ప్రజలు
సన్నుతింపంగ నాతఁ డె♦సంగుచుండె.

సీ. పాంచాలదేశ వి♦ద్వాంసుఁ డీతండు, తా
వకదర్శనార్థియై ♦ వచ్చినాఁడు
పాండ్యావనీంద్ర స♦భాపండితుఁ డితండు
తన సందియము దీర్చు♦కొనఁగ నిలిచె
వంగదేశాధీశు ♦ నాస్థాన కవి వీఁడు
నిజకృతి మీకు వి♦న్పింపవేచెఁ
గాశ్మీర రాజ్యవి♦ఖ్యాత ధర్మజ్ఞుఁడీ
విమలుండు మిమ్ము సే♦వింపఁదొడరె

తే. గీ. వీరు కోసలపండితుల్ ♦ వీర లాంధ్ర
కవివరేణ్యులు, వీరలు ♦ గిరి పురీశు
నాశ్రితు లటంచుఁ జూపెద ♦ రంతికంపు
జనులు కాల్యాంతమున నుత♦ధ్యానకు భక్తి.

సీ. తడవయ్యె రాజుఁ ద♦త్కాంతాసమూహంబు
నుద్యానవనసీమ ♦ నున్నవారు
జాలమయ్యె సమాత్య ♦ చంద్రుఁ డుద్యోగులు
ప్రాంగణభూమియం ♦ దుంగలారు
జాగయ్యె యాత్రిక ♦ ప్రాంసురుల్ వేగిర
పాటుమై గేహ పా♦ర్శ్వమునఁ గలరు
ఆలస్యమయ్యె య♦త్యోఘుంబు శిష్య సం
తతితోడ భవన మ♦ధ్యమున నిలిచె
తే. గీ. జాల సేపయ్యె బహుజాడ్య ♦ సతతపీడి
తాత్ము లివ్వారు పంగ్వాదు ♦ లవలనుండి
రంచు, మనవిఁబొనర్తురా ♦ యనఘమూర్తి
కచటి వారలు కాల కృ♦త్యాంతమందు.

సీ. జాడ్యాత్ములను జగ♦జ్జననీ పదోదక
ప్రోక్షణంబున సుఖా♦త్ముల నొనర్చి
వికలాంగులకు, దయా ♦ విర్భావ దృక్పరం
పరతోన రుచిరాంగ ♦ పాళిఁగూర్చి

జాత్యంధులకు, తపః♦శ్చర్యా నిధాన ని
ధ్యానంబు మాత్ర నే♦త్రంబులొసఁగి
బధిరాదులకు బహి♦ర్వ్యాప్త చక్రార్చ నా
కుంకుమంబున లోని ♦ కోర్కెఁదీర్చి
తే. గీ. పిదప, తన దర్శనమొనర్ప ♦ వేచియున్న
రాజ రాడ్బాంధవామాత్య ♦ రాజినెల్ల
నుచిత రీతిని పంపి స♦ద్యోగి సుకవి
గణముతో ముచ్చటాడు నా♦కవి సతంబు.

సీ. భారత్యుపాసనా ♦ వాసనోల్లాసుఁడీ
కవి కేసరి యటంచుఁ ♦ గవులు వలుక
నిత్యతన్మయ చిత్త ♦ నీరజానందుఁడీ
భక్తాగ్రణి యటంచు ♦ భక్తు లెన్నఁ
బరమార్థతత్త్వ యో♦గరహస్య సిద్ధుఁడీ
యోగీంద్రుఁడని యోగు♦లూహచేయ
సరస భాస్వర వచ♦శ్చాతుర్యధుర్యుఁడీ
విద్వాంసుఁడని శాస్త్ర ♦ విదు లనంగ
తే. గీ. పృథివిఁబుట్టిన మాపాలి ♦ వేల్పటంచు
ననదలెల్లఁ గైమోడ్వ ♦ నతులమాంత్రి
కాగ్రణియటంచు మాంత్రికు ♦ లాడుచుండఁ
గా నెసంగె నుతధుర్యుఁడా ♦ కాశియందు.

నెమ్మది౯, జుట్టమట్లు హితునింబలె, సోదరుచాయ, మంత్రిచం
దమ్మున౯, దండిద్రారి,గురు♦నాథు విధాన, స్వకీయ వంశ్యుదై
వమ్ము కర్మిమమ్మునం దలంచి ♦ పార్థివనాథుడుకొల్చువాని,ని
త్యమ్ముదదీయయోగమహి♦తవ్రతవర్తనలాత్మ మెచ్చుచు౯.

ఇమ్మెయింగొంత కాలము గ♦తింప ధరామరుడొక్కడెల్ల, దే
శమ్ములు గాంచి యందుఁగల♦సత్కవులన్ గనుచో నుతధ్యు నా
మమ్మును వించు వచ్చి కని♦మన్ననఁగొల్చుచు నేదియో,ప్రసం
గమ్మున౯ దద్గురూత్తముల♦గాధ వచించి విచార మందుచు౯.

తే. గీ. ఏక సుత వియోగంబు, భ♦రింప లేని
దేరి కేని, వారాక్రియ ♦ నేడ్చి, యేడ్చి,
యేమయిరో, వారి జాడయే ♦ యెఱుఁగరాద
టంచు వచియింప వి-చు, స♦త్యవ్రతుండు.

క. తన తొలికథయె, యతఁడు నుడి
వినఁ దన జననీ జనకుల ♦ వృత్తాంతమె, తె
ల్పిన నిర్వికారుఁడై యుం
డె, నెదన్ దుర్గా! జగమ్ము ♦ నీలీలనుచు౯.

క. ఈరీతి నాల్గు వర్షము
లారాజటు కొల్వనరిగె ♦ నాపై దుర్గా
స్మేర సితద్యుతినా, వి
స్తారశరద్వ్యాసర ప్ర♦తాన మెసంగెన్.

సీ. తలపుఁ జైదములఁ జె♦క్కిలిఁగొట్టి కిలకిల
నగులేమ నవ్వులోని ♦ నలువుఁగొంత
జడవేయుటు వేళఁ గీ♦ల్జడనుండి జలజల
రాలు మల్లియలోని ♦ రాణకొంత
కలయఁ జిక్కఁగ గుబ్బ ♦ కవపైన దళతళ
మెఱయు ముత్యాలలో♦వారువుకొంత
చల్లగాలుల కారు ♦ శ్రీమవారిఁ దెలతెల
మను కప్పురములోని ♦ గొనబు కొంత
తే. గీ. పరువపుఁగపోల సీమలఁ ♦ బ్రతిఫలించు
శ్రీవణభూషణ మణిచక ♦ చ్చకలొకింత
కానవచ్చిన వా; శర♦త్కాల సమయ
కౌముదీ రేఖలందు, జ♦గమ్మునఁదు.

## శ్రీ దే వీ న వ రా త్ర ము

హాయిన్ గొల్పెడునాశరన్నిశల, దు♦ర్గాంబాపదాఁభోజపూ
జాయత్తామలచిత్తుఁడై యతఁడు వ♦స్త్వోఘంబు చేకూర్పమం
చా యుర్వీధవ మాళి కానతి నిడ♦న్నట్లేయటంచుఁ బ్రియు
ఛ్ఛీఘ్రియుక్తుండతఁడెన్ని యేనియు నొన♦ర్చెన్ యత్నముల్ శ్రద్ధమై

సీ. భర్మ నిర్మిత మంట♦పమ్ము గూర్చినాఁడు
రత్నసంఘటితతో ♦ రణముతోడఁ
బంచపల్లవము లే♦ర్పరిచినాడు, సువర్ణ
వర్ణ సంభరిత కుం♦భంబుతోడ

నెమ్మదిఁ, జుట్టమట్లు హితునింబలె, సోదరుచాయ, మంత్రిచం
దమ్మునఁ, దండ్రిదారి,గురు•నాథు విధాన, స్వకీయ వంశ్యదై
వమ్ము కరిమమ్మునం దలఁచి • పార్థివనాథుడుకొల్చువాని,ని
త్యమ్ముఁదదీయయోగమహి•తవ్రతవర్తనలాత్మమెచ్చుచున్.

ఇమ్మెయిఁగొంతకాలము గ•తింప ధరామరుఁడొక్కఁడెల్ల, దే
శమ్ములు గాంచి యందుఁగల•సత్కవులన్ గనుచో నుతధ్యు నా
మమ్మును వించు వచ్చి కని•మన్ననఁగొల్చుచు నేదియో,ప్రసం
గమ్మునఁ దద్గురూత్తముల•గాథ వచించి విచార మందుచున్.

తే. గీ. ఏక సుత వియోగంబు, భ•రింప లేని
దేరి కేని, వారాకిరియ • నేడ్చి, యేడ్చి,
యేమయిరో, వారి జాడయే • యెఱుఁగరాద
టంచు వచియింప విఁచు, స•త్యవ్రతుండు.

క. తన తొలికథయె, యతఁడు నుడి
వినఁ దన జననీ జనకుల • వృత్తాంతమె, తె
ల్పిన నిర్వికారుఁడై యుం
డె, నెదన్ దుర్గా! జగమ్ము • నీలీలనుచున్.

క. ఈరీతి నాల్గు వర్షము
లారాజటు కొల్వనరిగె • నాపై దుర్గా
స్మేర సితద్యుతినా, వి
స్తారశరద్వాసర ప్రి•తాన మెసంగెన్.

సీ. వేయి రేకులతమ్మి ♦ విరిలోని తేజము
దీపింపఁ బ్రాణ ప్ర♦తిష్ఠ చేసి
మొదలినాడీగణం ♦ బుద్రేకముం జెంద
షణ్ణవతికళాను ♦ చర్చ సలిపి,
యధిదేవతాళిఁ బ్ర♦త్యధిదేవతాళి నెం
చి నవావరణపూజ♦లను ఘటించి
సూక్తంబులను షోడ♦శోపచారంబుల
కనువదించుచు, సమ♦ర్చనలనిచ్చి
తే. గీ. యంబికాసహస్ర త్రిశ♦త్యాదినామ,
ఖడ్గమాలాఘ కుంకుమా ♦ ఖండపూజ
లను రచించెను, బహి రంత♦రముల భక్తి
శిష్టహిత సమయాచార ♦ శీలుఁ డతఁడు.

సీ. సాంగంబు మంత్రర♦హస్యం బెఱుంగు దు
ర్గోపాసనాశీలు ♦ రొక్కచోటఁ
బారాయణక్రమ ♦ ప్రాభుత్తై సప్తశ
తిం బఠించెడు భూమి ♦ దేవులొకటఁ
దత్త్వంబుఁ దెలిసి కా♦త్యాయనీభాగవ
త పురాణముఁ జెప్పు ♦ ధన్యులొకట
నిత్య హోమక్రియా ♦ నిపుణులు సర్వప్ర
యోగజ్ఞులగు విప్ర♦లొక్కప్రక్క

తే. గీ. నంబ యట్లు ప్రత్యక్షార్చ ♦ లందనున్న
పుణ్యకాంతామతల్లి స♦మూహమొకట
నుత్సవాగత సజ్జన ♦ వ్యూహమొకట
నిలువ సత్యవ్రతుండందుఁ ♦ గొలిచె నంబ.

తొలుతనె దీక్షఁబూనినిశఁ♦దోయము మాత్రము త్రావిమూఁడు వే
ళల, శివపూజయున్ మనుపు♦రశ్చరణంబుఁ, జిరంటికా సమ
ర్చలు, మహితాన్న దానము,ని♦రంతరమౌనముతోనొనర్చె, న
య్యలఘుఁడు నెమ్మనంబెటఁగి♦యందలివారు మెలంగుచుండఁగాన్

ఉ. లేవఁడు! లేచె నేన్ గురుకు♦ లేశ్వరి పూజకు లేచు, నెయ్యదేన్
ద్రావఁడహంబు నందటులు♦ద్రావినఁ దత్పదవారిఁద్రావు నే
మే వినఁ డేదియేన్ వినిన ♦ నీశ్వరిగాథ వినున్ గనుంగొనం
డేవియుఁదాఁగనుంగొనఁగ♦ నెంచిన నంబఁగను న్నతండఁటదన్.

అనుకొనరాదుగానియతఁ♦డాక్రియధ్యానమొనర్చుచో "నదా
టున గననేన్ బరాంబికయ♦టుల్ విలసిల్లె" నటంచుఁ గాంచగాఁ
జను జనులొండ్లతో గుస గు♦సల్ పొనరింప శివాకళల్ కడ
ల్కొనె బహిరంతరాళముల♦లోఁదదదృష్టమికేరి కన్బడున్.

క. చననీక్రియఁ దొమ్మిది నిశ
లును కనవచ్చెడు జనాళి ♦ రోగంబులు దూ
లెను నోముల్ పండెను వా
నిన కనిరెల్లరును విశ్వ ♦ నేత్రివిధమునన్.

సీ. మహిషాసుర కిరీట ♦ మణి రుచిచ్ఛటఁ బంట
తెఱవ క్రొందళ్కు లం♦దిన దినంబు
పురదైత్య రుధిర శ్రీ ♦ కరపాళి నలిక లో
చను మేను కెంపు గాం♦చిన దినంబు
రఘుకులేశ్వరు క్రుధా♦రంభ వేళల నదీ
ప్రియుఁ డభయంబు గో♦రిన దినంబు
భువన మోహన బీజ♦ముద్రితాత్ముఁడు సుద
ర్శనుఁ డమితాళిఁ దు♦న్మిన దినంబు
తే. గీ. మత్స్యధవ ధేను హరణ ప్ర♦మత్సరాత్మ
కురు బలోన్మూల నోత్సుక♦స్ఫురణఁ గ్రీడి
గుప్త నిజకార్ముకంబు, గై♦కొనిన దినము,
విజయదశమి ప్రవేశించి ♦ వేడ్క నించె

కలశోద్వాసన మాట నాడఖిల సౌ♦గంధ్య స్ఫురద్వస్తు రా
సులఁ దేఁబంచి,హుతాశనాస్యమున స♦త్పూర్ణార్థ సంపత్తి ను
జ్జ్వల దంబా హృదయప్రశాంతికయి వ్రే♦ల్వన్ బూనె నవ్వాడ్పు,వి
స్తుల పారీమళ హోమధూమము దిశా♦స్తోమంబులన్నిండఁగన్.

సీ. స్వాహా స్వధా పద ♦ ద్వయ నినాదవిధాన
హోమ తర్పణ తతు ♦ లొక్కచోట
బ్రహ్మ శక్త్యైక్య సూ♦త్రిముఖ ప్రశాంతి సూ
క్తౌఘ నిస్స్వానంబు ♦ లొక్కచోట

భూదేవ కృత సు స్వ♦రోదీర్ణ వేదార
వోత్స వాడంబరం ♦ బొక్కచోట
స్వర్ణ దుర్గా నామ ♦ పారాయణానంద
యుత భక్తవర్యాలిం ♦ కొక్కచోట
తే. గీ. మంజుల మృదంగ వీణాది ♦ మంజిమ ప్రి
ణాద మొకచోట, హోమ వి♦త్రాదర జన
కలకలధ్వాన మొకచోటఁ, ♦ జెలఁగఁ జెలఁగఁ
గట్ట కడరోజు ప్రాభవ ♦ కౌతుకముల.

సీ. కన్నీరుదారల, శ్రీ♦కనకదుర్గేశ్వరీ!
కనికరంబునఁగావు ♦ మనెడువారు
భక్తి తన్మయ గద్గ ♦ దోక్తుల నీలోనఁ
గలుపుకో మమ్మని ♦ పలుకువారు
బులకిత గాత్రులై ♦ కల యభీష్టార్థంబు
లనుగూర్పు మని మ్రొక్కు ♦ కొనెడువారు
శిరము నురంబు ను♦ర్వర మోపి జయ శివే
ప్రేమఁ జూడుమని య♦ర్థించువారు
తే. గీ. సారెసారెకు నంబికా ♦ కారమరసి
హృదినిఁ దన్మూర్తి నిలుపుకో ♦ నెంచువార
లగుచు, దేశదేశాగతు ♦ లైన భక్త
వరవితానంబులు, మెలంగు ♦ తరుణమందు.

సీ. ఇదికూట మని చాటు ♦ నుదుటి గీరలపైన
భూతిరేఖలు కళా♦స్ఫూర్తి నింపఁ
గనుపడ్డవారి "నె♦గాదిగ" వీక్షించు
దృష్టి, దైన్యత్వంపు ♦ దెర ఘటింప
ముడుతలు వడి, వెన్ను ♦ పూస నంటినబొజ్జ
లలిత రుద్రాక్ష మా♦లలు నటింపఁ
జిత్రకుశాద్యాస♦న క్రియంబులు గక్ష
మందుఁ దపశ్శీలుఁ ♦ డని వచింపఁ

తే. గీ. గావిమడుగు శుచిత్వంబుఁ ♦ గ్రాలఁజేయఁ
జేతి బుడిచెంబులోనీరు ♦ చిందువారఁ
దన్ననుసరించెడు సతీమ ♦ తల్లితోడ
వేడ్కఁ గనవచ్చెఁ బరదేశ ♦ విప్రుఁడొకఁడు.

తే. గీ. ఆక్రియఁ బరాంబికామంట ♦ పాంతరంబు
కడకుఁ జనుదెంచి వినుతించి ♦ కైమొగిడ్చి
దరిసి విప్రప్రతాన మ♦ధ్యమున, హోమ
ముంబొనర్చు, సత్యవ్రతు ♦ మోముఁగాంచె.

కాంచినతోడఁ బెన్నిధిని♦కాంచినటుల్ మొగమింత కాగ, వీ
క్షించి, క్షణంబులోనఁదన♦చెయ్యొలడంగ వృథాశయంచు, యో
చించి, వితాకుఁబెంచి, యుసి♦సీ, జనియంచు, సతీమతల్లిపై
నించెను, చూడ్కులా మొ, యత♦నింబలెనే, కుములందొడంగుచున్

తే. గీ. పోలికలు కొన్ని, మదినున్న ♦ పోల్కిఁగలియ
నిచిత దుఃఖాగ్ని కీలఁ గ♦న్నీటివెల్లి
మున్నె యింకుట, లోలోనఁ ♦ బొగులుచుండెఁ
బుటము వెట్టిన టెంకాయ ♦ పోల్కి నామె.

ఆకరణిం దపించుసతి నారసి ♦ యీతఁడు నాతఁడౌనొ? కా
డో, కనుగొమ్మ విశ్వమున ♦ నొక్కరిఁబోలి మరొక్కరుండు రీ
పొకటయోగివాఁడగునె? ♦ భాగ్యవిహీనుల మిట్టి యాసతో
నే, కడ కీతనుద్వయము♦నింకఁగలఁదో ప్రియుదు మోఁ, హృదీశ్వరీ.

క. అనియా బ్రాహ్మణుఁ డన న
వ్వనితయు నీ రెలుఁగుతోడ ♦ వాని వదన మం
దునగల పోలిక లొకపరి
కనుఁడని పేరాసతోఁ బఁ ♦ గానిట్లనియెఁ.

సీ. జడ వెడలించి క్రొ♦మ్ముడి ఘటించితి మేనిఁ
గప్పు వెండ్రుకల ని♦క్కముగ వాఁడె
కావు లావలఁద్రోసి ♦ కటిఁజల్వ గట్టింపఁ
జాలుదు మేని ని♦శ్చయము వాఁడె
మొలక మీసలచాలు ♦ మొదలంట తుడిపించి
చర్చింతు మేని న♦చ్చముగ వాఁడె
వసివాళ్లు వడిన క్రొం♦బసిఁడి మేనికి తొంటి,
తళుకం టెనేని స♦త్యముగ వాఁడె

తే. గీ. పదియురెండేండ్లప్రాయంపు ♦ బసి తనమ్ము
పై కొనిన వీనికిపుడు ధ్రు ♦ వమ్ముఁ వాఁడె
ధ్యానకుంచిత దృష్టి న ♦ ల్దట్టులందుఁ
బాలుఁ జిమ్మినచో, మన ♦ వాఁడె వీడు.

తే. గీ. అనుచు తెప్పలఁ జిప్పిలు ♦ నశ్రుకణము
గోటఁ జిమ్ముచు, ముని మాటి ♦ మాటి కరసి
మదిఁ గుమారిలు చున్నట్టి ♦ మగువఁ గాంచి
పట్టరాని వేదనఁ జెందెఁ ♦ బ్రాహ్మణుండు

క. జన సమ్మర్దంబిట, ర
మ్మని సతి వెనువెంట రాఁగ, నవ్వేదిక చెం
తనొక విశాలస్థలమున
వనటమెయిన్ జేరి కూలఁ ♦ బడి యిట్లనియెన్.

తే. గీ. పోలికలు కొన్ని మొగమందుఁ ♦ దేలెననుచు
నకట! యడియాసఁ బొగిలెద ♦ వతనిఁ గాంచి
యొకనిఁ బోలిన వారెంద ♦ రుండరవని
నతఁడె తండ్రౌనె? యంత భా ♦ గ్యంబె మనకు.

కడచిన విన్నియేఁడులును ♦ గాంచముపో, కసిగందుజాడ ని
వ్వడువున దేశదేశములు ♦ వానికినై నెమకఁ గతించె, నీ
యొడలిబలమ్ము సర్వమయె ♦ యోయడియాసయె కాని, యాతఁడె
క్కడ, యతఁ డెక్కడెక్కరణిఁ ♦ గన్పడునే మనకాతఁ డెన్నఁడేన్.

గతజల సేతుబంధనము ♦ కాకిది వేఱొకటౌనె? కాశి, దు
ర్గతుల నడంచు నంచని, పు♦రాణ చయంబులు వాకొనన్ ముని
వ్రతము గ్రహింత మియ్యెడఁ బ♦రంబున నన్ సుఖమబ్బు నింక నీ
గతి దురపిల్లినన్ గొడుకు కన్బడునే ♦ మన కండ్ల కంగనా.

ప్రాక్తన కర్మ బద్ధులగు ♦ ప్రాణులు స్వీయ కృతాఘ సంఘమున్
ద్వ్యక్తమొనర్తురీ భవము♦నందు, వ్యథాగ్నులఁ దేలి, యందులో
యుక్త మయుక్తమున్ దెలిసి♦యున్నను, కర్మవిధిన్ జరింప నా
సక్తి వహింతు రంబురుహ ♦ జన్మని కే నిది తప్ప దంగనా.

క్రీతు సమయంబునాఁక, ముని♦గణ్యుఁ డతం డన కూర్పుచే, స్వర
స్థితి, గతిఁ దప్పెనంచుఁ గ్రుథఁజెంది, దురుక్తులచేఁ బరాభవిం
చితి సభలోన గోబిలు ని♦సీ యన సాటిజనంబు నాటి మ
త్కృత దురితాగ్నికీల, దహి♦యింపక మానునె? నన్ను గేహినీ.

క. నాయట్టివాఁడు క్రీతుఁడీ
క్షాయత్తుండయి దురాగ్రహంబున క్షాంతి
శ్రేయస్కుని, యటులనె నన,
వ్యాయతమగు తొంటికర్మ♦వశమున నకదా!

అనవిని యామె యాతని వతాననమున్ గనియార్పుఁబుచ్చి యా
యనఘచరిత్రితో సకల♦యత్నములున్ గడముట్టు వాని నిం
క నెమక దార్ఢ్యమేది మన♦ కాయములందుఁ దదర్థ మేరి నేఁ
బనుపగ ద్రవ్యమేదొక, త♦పంబె శరణ్యమటంచుఁ దోఁచెడున్.

క. సంతర్పణహోమంబులు
సాంతంబగునవల నెట్టు♦లైనను దద్వృ
త్తాంత మెఱుంగుడు కరుణా
స్వాంత పరాంబికయె, యాశ్రి♦తాభీష్టమిడున్.

చ. అనుపలు కాలకించి సము ♦ దారజగజ్జననీ పదాబ్జ మా
త్మను మననంబొనర్చి, కను♦దమ్మి నొకింత మొగుడ్చి ధ్యానసం
జనిత ధృతిన్ వహించి, సతి♦చాయలఁజూచి పరాంబికా విలా
సనిభృత మీజగచ్చయము♦ సర్వము, జీవనిమిత్తమేసుమీ.

తే. గీ. ఎవఁ డహంకృతి వీడి, ప♦రేశ్వరీవి
లాస మాత్ర మే నంచు, ని♦ర్మల మనస్కుఁ
డగుచుఁ దత్పాద శరణార్థి♦యై రహించు,
వాఁడవో, శాశ్వతుండగు ♦ వాఁడు నెలఁత.

అని, యాతండువచించుచుండు నెడ, హో♦మాదుల్ ప్రపూర్ణంబుల
య్యెను, మౌనవ్రతమున్ ద్యజించె ముని, భూ♦మీశానుఁడున్ మానులా
తని, సేవింపుచు మంటపంబు కడమా♦తన్ గొల్చుచున్నారు, బ్రా
హ్మణవర్యుల్, మడుఁగుల్ ధరింపఁ డనుచుం♦బల్కె న్నొకండా దృతిన్.

తే. గీ. ఆనుడులువించు, ధవుమోము ♦ నరసి యామె
యతని నోరతూరి కాంచి, వృ♦త్తాంత మెఱుఁగు
జతనములొనర్ప నిక లేచి ♦ చనుదమనిన
వల్లెయని భూసురుండు సంభ్రమపు గతుల.

వని, కాంచెఁ ధరణీసురుం డతివతో ♦ సత్యవ్రతుఁ శాంకరీ
ఘనకారుణ్య కటాక్ష లబ్ధ కవితా ♦ కాంతానురాగైక సం
జని తానంద రసాంచితుఁ మునిజన ♦ శ్లాఘ్యప్రపూతప్రవ
ర్తన సంశోభితు, ధారుణీశ్వర బుధ♦వ్రాతావృతుఁ సువ్రతుఁ.

క. కని, వలయుంబుగ నిలిచిన
జనతతిఁ దప్పించు కొంచు ♦ సతితో మునుముం
దున కాతఁడుజని, ముని యా
నన మరయందొడఁగె, నెమ్మ♦నం బురియాడఁ.

క. ఆయమయు, వాని, సుతుఁగా
నే మొద నిశ్చయ మొనర్చి ♦ స్మృతిఁ దవిలిన వే
మో! యూహించుచు నుత్సా
హాయత వీక్షణాల నతని ♦ నరయుచుఁ దనలో.

సీ. అందునా? వీఁడు నా♦నందనుండని యట్లు
కాకున్న నగుబాటు ♦ కాదె నాకుఁ
బిలుతునా? వీఁడు మా♦ర్వలుక కున్నెడవీరి
కడ నే మొగంబెత్త ♦ గలుగుటెట్లు
నిలుతునా? వీని ముం♦గల వీఁడు ననుఁజూడ
కున్నచోఁ దలవంపు ♦ కూడ కున్నె
చెప్పింతునా? యేరి♦చేనైన నిది వీఁడు
వినకున్న మరియాద ♦ వెలితి పడదె

తే. గీ. ఏకతమ పోయి, యీకథ ♦ నేమ తెలుపఁ
గాదనిన వీఁడు, నేఁ జేయఁ ♦ గల ది కేమి?
యంబికా! యేమి చేయుదో ♦ యంచు నామె
యటమటించుచు నున్నట్టి ♦ యవసరమున.

తే. గీ. కనకదుర్గా పదధ్యాన ♦ మును ముగించి
భక్తిఁ బ్రసవాంజలు లొసంగి ♦ భక్తవరులఁ
గాంచి వారి, సంతర్పణ ♦ కార్యమునకుఁ
గడఁగుఁడంచు, జనౌఘంబుఁ ♦ గలయఁ జూడ.

ఉ. ఆతరి, వానికంటఁబడి ♦ రంచితదీన దశా విలీన వి
ద్యోతముఖుల్, నిజాత్మజవి ♦ యోగ విచారపరీత చిత్తు లు
త్ఖ్యాత ధరా నిలింపకులు ♦ గణ్యులు, సువ్రతతత్పరుల్ కృశీ
భూత శరీరులా మహిత ♦ పుణ్య సతీపతు లిర్వురయ్యెడన్.

ఉ. వారలఁగాంచి, నివ్వెఱగు ♦ పాటును సంభ్రమ మాత్మలోన నే
పార శిరమ్ము వంచి జగ ♦ దంబికపైఁ గనులుంచి నీవ యీ
తీరునఁ బూజ్యపాదుల వి ♦ ధిన్ జనుదెంచితి నేటికంచు, న
వ్వారలఁ జేరి మ్రొక్కె ఋషి ♦ భావన చేయుచు నంబనాత్మలో.

మ్రొక్కిన మ్రొక్కుతో శిరము ♦ మూర్కొని గ్రుచ్చి కవుంగలించి నున్
జెక్కులు దువ్వి తల్లి, జడ ♦ చిక్కు నఖంబులఁ జీరె తండ్రి, న
య్యక్కలిత ప్రహృష్ట హృద ♦ యాంబుజులై విలువెల్ల కన్నులన్
ఫక్కఁ జెలంగఁ బౌరజను ♦ వారము గాంచి వెఱంగు నొందుచున్.

వారల పోల్కి, మౌనివరు ఫాలమునన్ గనుపట్టె, వీర తె
వ్వారలొ? తల్లిదండ్రులును బాంధవపాళియు లేరటంచు, వి
న్నారము, తద్గుణోత్తములనందగుఁ దక్కొరులైనచో, దయో
దారుఁ బరాంబఁ బోలు ముని తల్లజుఁ గౌఁగిటఁ జేర్ప నర్హులే.

అని యూహింపఁగ నా సతీపతులు కళ్యానందమేపార నం
దనునిన్ గౌఁగిటఁ జేర్చుచున్ నిమురుచున్ దర్కించుచున్ వాని మో
మును వీక్షించుచు మూర్తమున్ గడిపిరా భూపుండు, సర్వంబునున్
విని, యవ్వారి కథావిధానమెఱుఁగం గాఁబంపె; స్వీయద్విజున్.

సీ. ఊర్పుగాడ్పులు లోవి యోగాగ్ని వెలిద్రోయఁ
గొసరుచు శిరసు, మూర్కొనెడు తల్లి
సంభ్రమంబున మేను జలదరింపఁగ నిండు,
కూర్మిఁ గౌఁగిటఁ జేర్చుకొనెడు తండ్రి
చిదువలై కరగలై చిందు ముదశ్రువు,
లాదరంబునఁ జించుచుంటు తల్లి
ఏదియో నుడువ నూహించి డగ్గుత్తిక
వడఁ గుమారుని మేను తడవు తండ్రి

తే. గీ. శయమునుండి జారిన సుధాశకలమొకటి
చిక్కినట్లు, నిర్జీవుండు జీవితుఁడయి
చెలఁగి నట్లున్న తల్లిదండ్రులను గాంచి
యంబనెంచుచు నిల్చె సత్యవ్రతుండు.

తే. గీ. అంతట పురోహితుఁడు వారి♦చెంత కేగి
పుణ్యదంపతులార! మా ♦ పుడమిఱేఁడు
మీకథ నెఱుంగఁగోరె, మీ♦కీ కవీంద్రుఁ
డపరదుర్గాసుతుఁడు జుట్ట♦మయ్యెనెట్లు?

తే. గీ. అనినఁ బరదేశి మౌని యా♦ననముపైన
దృక్పరంపర లిడి, యతం♦డేమి యేనిఁ
బలుకకున్కిఁ గడచిన గా♦థలఁ దలంచి.
వ్యసనము వహించి, తుదకు భూ♦వరునిఁగాంచి.

అనఘా! యేమని విన్నవింపఁ గలన♦య్యా; "రోళ్ళ రోకళ్లఁ బాడిన" నా దీన కథా విధానమును, వీ♦డే సుమ్మి, యేకైకనం దనవిశ్లేష దవాగ్ని తప్తమతి, యీ♦దౌర్భాగ్యుఁడే మంచు, వా కొనఁగా నేర్చు స్వయంకృతాఘములలో♦కుల్ ఛీయనన్ గ్రమ్మఱన్

తే. గీ. అతఁడా భంగి వాకొనుచ్చు ♦ నపుడు, యమియు
శాంతుఁడు గృశాంగుఁడమల తే♦జస్వియొక్కఁ
డా గృహాంతరమందుండి ♦ యరుగుదెంచి
యతని నుడివించుఁ బొగిలి, తా♦నతనిఁ జేరి

తే. గీ. సుఖమొ? మిత్రమ నీకు నీ♦సుదతి, కితఁడు
మన యుతఘ్నుఁడా? యెంతటి ♦ మహితుఁడయ్యె
నీశ్వరీకృప, మీపుణ్య ♦ మెవరి కబ్బు
నేఁగృతార్థుండ నైతి మి ♦ మ్మిందుఁగాంచి.

క. అని యన, నాపరదేశియు
ననఘమతీ! గోబిలా త్వ♦దంచిత కరుణా
బ్ధిని ముంచితి వపు డద్దా
నిన మనవాడింతయయ్యె ♦ నిఖిలకళలలోఁ.

తే. గీ. ఆపలుకు లాలకించి, స♦త్యవ్రతుండు
గోబిలునికి మ్రొక్కఁగ, వానిఁ ♦ గ్రుచ్చికౌఁగ
లించి, దీవించి, కన్నీరు ♦ నించి యంబ
నెంచి, భూపునీక్షించి, వ♦చించె నతఁడు.

తే. గీ. భూమిపా! వీరి వృత్తాంత♦మును వినంగ
వేడ్కపడుచుంటి, వినుము నే♦వినుచువాడ
ననఁగ, "వింజమాకిడినట్లు" ♦ లఖిలజనులు
సావధానులు గా నతం♦డనియెనిట్లు.



ఓం

శ్రీమత్పరాంబికాయైనమః

# శ్రీ కళా సిద్ధి



## పూర్వగాథ

తే. గీ. అవనిఁ గోసలసీమ దు♦ర్గాగ్రహార
మను పురంబుందు, వేద వే♦దాంగవిదుఁడు
సర్వభూతసముండు, ప్ర♦శాంతచిత్తుఁ
డుత్తముండు, దేవవ్రతా ♦ ఖ్యుండితండు.

తే. గీ. ఇతని కులపాలికామణి ♦ పతిహితైక
వర్తనాచార విభవ వి♦భాసురాత్మ
స్వర్ణదుర్గాంబికా పాద ♦ పంకజాత
చంచరీకమిా రోహిణీ ♦ సతి క్షితీశ.

తే. గీ. వీరలిర్వురు సమధిక ♦ విమలధర్మ
తత్పరాచారవర్త నా♦ద్యఖిలగతులఁ
బుడమివేల్పులు, వేల్పులుఁ ♦ బొగడుభంగిఁ
గాపురమొనర్చు చుందురా ♦ గ్రామమందు.

తే. గీ. ప్రాక్తనభవార్జి తాఘ మూ♦లమునఁ జేసి
సతత దుఃఖసంభరిత సం♦సారనాట
కాంతరమున, ముద్దాయకం ♦ బగు నపత్య
మలవడమి, వారలాత్మలో ♦ నహరహంబు.

సీ. సంతాన మగుగాక ♦ సరస పక్వఫలాది
శూన్యంబు నెవ్వారు ♦ జూతు రొక్కొ
కల్పవల్లియె, యగున్ ♦ గాక, సూనమనోజ్ఞ
శూన్యంబు నెవ్వారు ♦ జూతు రొక్కొ
కనకాబ్జ మేయగుఁ ♦ గాక, సౌరభ కళా
శూన్యంబు నెవ్వారు ♦ జూతు రొక్కొ
కామధేనువె, యగుఁ ♦ గాక, వరాపత్య
శూన్యంబు నెవ్వారు ♦ జూతు రొక్కొ
తే. గీ. గగనమందాకినియె, యగున్ ♦ గాక, జలజ
శూన్యమగునేని నెవ్వారుఁ ♦ జూతు రొక్కొ
యజుని తలఁదన్ను బ్రాహ్మణుం ♦ డగునుగాక
సుత, విశూన్యు నెవ్వారలు ♦ జూతు రొక్కొ.

క. అని పొగులుచుఁ బుత్రేష్టిఁ
బొనరించిన కాంక్ష తీరుఁ ♦ బోయని తగు య
త్న నికాయంబు సలిపి బ్రా
హ్మణవరులఁ రాఁబిల్చి భక్తి ♦ మహితుం డగుచున్.

సీ. నిగమాగమజ్ఞాన ♦ నిష్ణాతు నపరప
రబ్రహ్మను సుహోతృ ♦ బ్రహ్మఁజేసి
ప్రాఁబల్కునకు నొండు ♦ పథముగూర్చిన, యాజ్ఞ
వల్క్యమహానీంద్రు ♦ నధ్వర్యుఁజేసి

కరుడు గట్టిన కళా♦భరణంబు దైవత
వ్రాతగురుఁ గురు♦హోత్రఁ జేసి
యఖిలాగమ స్వతం♦త్రైకతంత్రిని జన
స్తుతశీలుఁ బైలుఁబ్ర♦స్తోత్రఁ జేసి

తే. గీ. నన్ను నుద్గాతఁ జేసి వి♦న్నాణులైన
తక్కువారలఁ దక్క వి♦ధానములకు
నిలిపి దీక్షితుఁడై తాను ♦ చెలఁగ నీతఁ
డమర తతులెల్ల సంబర♦మంది చూడ.

సీ. అత్యుదాత్తంబుగా ♦ నలరించుచో వియ
ద్గంగాతరంగ నా♦దములనేల
ననుదాత్తగతిఁ జూపు ♦ నట్టిచో నిర్ఝరీ
మర్మరారావ సం♦పదలఁ దేల
స్వరితంబుగా గళం♦బారయించుచో గచ్ఛ
పీవిపంచీ స్వాన ♦ విధులఁబోలఁ
బ్లుత వైఖరుల స్వర♦స్థితిఁ గూర్చుచో స్నిగ్ధ
మంజు మర్దళ నిగుం♦భనలఁగ్రాల

తే. గీ. సమత రూపించుచో సహ♦స్రారకమల
కర్ణికాంతర ప్రణవ వి♦ఖ్యాతగాన
మధుర కళలీల, సామాగ ♦ మమును పాడి
నాడ వినువీథిఁ బ్రమథగ♦ణంబు మెచ్చ.

తే. గీ. అట్లు సామాగమ ఖ్యాత ♦ మగు రథంత
రంబు సప్తస్వర ప్రియు ♦ క్తంబుగాఁగ
యుచ్చరించెడు నెడల నా ♦ యూర్ధ్వ వశత
స్వర మొకండు తప్పెను జుమ్మ ♦ ధరణిపాల !

క. శాంతవ్రతదీక్షిత సు
స్వాంతుం డగు, సీతఁడా య ♦ పస్వరమును వి
న్నంత, మొగమెఱ్ఱవడ నే
త్రాంతంబుల నిప్పు లురల ♦ నారయుచు ననున్.

క. ఓరీ, మూర్ఖ హృదయ, సుక
మారున కై, సల్పు యాగ ♦ మధ్యంబున, నీ
వీ రీతి నపస్వర మే
లా? రాఁ బల్కితి వెఱుంగ ♦ వా? యొడలిం తేన్.

అన విని, మానసంబున రు ♦ షాగ్ని కడల్కొన నేను సీతనిన్
గనుఁగొని శ్వాసమూలమున ♦ గాని యుండు సమస్తజీవులె
ట్లును, భగవత్కృతంబది య ♦ మోఘము, దాని నడంప శక్యమే
మనకిటు తూలనాడితి వి ♦ మర్శనచేయక, తీవ్రబుద్ధివై

తే. గీ. దోష విరహితు ననుఁ దిట్టఁ ♦ దొడఁగి తెట్టు
లట్టి తిట్టు నీదు కుమారుఁ ♦ డనుభవించు
గాక మూర్ఖ స్వభావుఁడై ♦ లోకులెల్ల
ఛీ కొనఁగ నంచు, శాప మి ♦ చ్చితి నృపాల.

ఆరీతిన్ బ్రతిశాప మే నిడఁగఁ గో♦పాగ్నుల్ శమింపన్ గుర్విభా
స్ఫారున్ నన్నని వెల్లవోయి, మినుపైఁ ♦ బడ్డట్టు చింతించి దై
న్యారావంబుల వేఁడి నన్నునితఁడు ♦ దృచ్ఛాంతునిం జేసె, భూ
దారా! బ్రాహ్మణకోప మొక్క త్రుటి మా♦త్రంబే కదా యెందు నేఁ.

తే. గీ. అట్లు శాంతించి జరిగిన ♦ దాత్మ లందు
నెంచి చింతించి నార మే ♦ మేరికేని
నడుగు జారినఁ దీసికో ♦ నగును గాని
నాల్క జారినఁ దీసికొ ♦ నంగనగునె ?

మమ్ములఁ గాంచి యందుఁ గల మౌని వితానము మౌన మూని శీ
ర్షమ్ముల వాల్చి నెమ్మదిఁ గ♦లంగఁ బ్రతిక్రియ యెయ్యదేని ల
భ్యమ్మగు నా? యటంచు నెద♦నారయు చుంటిని యేను నంత నీ
యమ్మయె నుమ్మలించె న♦కటా! యని కన్గవ నీరు దేరఁగన్

తే. గీ. పులుకు పులుకునఁ గన్నీటి ♦ ముంపులోనఁ
దెప్పరిల నప్పళించుచు ♦ తెప్పలింత
లౌరా రెలుఁగు తోడ నీశ్వరా ♦ యిందుకొఱకె
యాగమును గూర్చి తేయంచు ♦ నడలఁదొడఁగె

తే. గీ. నిచిత సాధ్వీమతల్లి క♦న్నీటి వెల్లి
నెవని, సుకృతా తపసిరుహం ♦ బిలుకుఁ ద్రెళ్లి
నట్టివాఁ డథోగతిఁబడి ♦ యాటుమాటించు
జన్మశతకమ్ములకైన, శా♦జన్య వాళ్లి.

తే. గీ. అట్టులా సాధ్వి దురపిల్లు ♦ టరసినంత
నన్నుఁ బ్రీతిశాపదగ్ధు నో♦నర్చునేమొ?
యనుచు జంకి, నాయవివేక ♦ మునకు సిగ్గు
వడుచుఁ దలవాల్చినాఁడ, నీ♦తఁడును పిదప.

క. నిరపత్యత యే మేలో క
కరణిని, మూఢాత్ముఁడేనిఁ ♦ గన్నకొడుకు, నె
త్తెఱఁగున జననీ జనకులు
భరింపఁ జాలెదరు మాని♦వర్య ధరిత్రిన్.

తే. గీ. ఏనకా, కన్నుఁగానక ♦ నిట్లు విన్నుఁ
గాఱు లఱచిన, పేర్లిరిన్ ♦ గాన నన్నుఁ
దాపకీన శాపాగ్ని కిం ♦ ధనము చేయు
మయ్య పొడమని నిసుఁగు, న్యా♦యంబె? తిట్టు.

క. అని, జాలిచూడ్కి సీతమ్ము ... ... ...
నసుఁగనఁగా నొక్క త్రోవ♦నాపాటిఁ బొడగ
ట్టినఁ గని మానుల నిట్లం
టిని, యందలివారికెల్ల ♦ నెగులుడుగ నృపా.

పదునాల్గేడులు దన్క నే ననిన తే♦వన్ మాత్రువై యాండి ...
పిదపన్ సర్వకలాకలాపములలోఁ ♦ బెంపొంది దుర్గాంబికా
పదభక్తుండయి, సత్కవిత్వకలనా ♦ వ్యాప్తిన్ యశ...కన్యకా
స్పదుఁడౌ నీతని సూనుడంచు, ధరణీ♦శా! శాపమున్ ద్రిప్పితిన్.

తే. గీ. ఇష్టి సంపూర్ణమయ్యె రెం♦డేండ్లు దాట
సాధ్వి రోహిణి గర్భాన ♦ జనన మందె
నీ మహాభాగుఁడీయోగి ♦ యీ మనీషి
యీ కవీంద్రుఁడీ సత్యవా♦క్యైకరతుఁడు.

మనముల నున్నకామ్యమొక ♦ మాదిరిగా నెరవేర్చుకొంటి మం
చని, ప్రముదబ్ధిఁ దేలుచు, మ♦దంచిత శాపహాలాహలాగ్ని కీ
లను, స్మరియించి నిత్యము ద♦లంకుచుఁ దార్ప్వదిగింటె, బిడ్డనిన్
బెనిచిరి పో, యుతథ్యుఁడను, ♦ పేరిడి యీమహితుల్ మహీశ్వరా.

తే. గీ. విపథ రాక్రాంతమైన క్రొ♦వ్విరుల సెజ్జఁ
బవ్వళించిన వాని భా♦వమ్మునందు
నేక్రియ సుఖానుభూతి ల♦భించు? వీర
లట్టులే కాలముఁ బుచ్చి ♦ రవనినాథ.

క. పెరిమమ్మును, గుతుకమ్మును
దొరలగ నొక్కొక్కభంగిఁ ♦ దోయము వారం
దరు మెచ్చఁగఁ బెంచిరి, క్రొ
వ్విరి తీవటు లితఁడు బెరిగి ♦ పెద్దయి నంతన్

తే. గీ. అనృతమాడమి, యాబాల్య ♦ మాదిగాఁగ
యభ్యసించిన యట్టి, మ♦హాత్ముఁడగుట
నఖిల జనులు సత్యవ్రతుం♦డనఁ దొడంగి
రనఘ, యైదేండ్లకే కీర్తి ♦ నందె నితఁడు.

తే. గీ. వాని నుపనీతుఁజేసి దే♦వవ్రతుండు
సంజ చెప్ప, ఓమన వెట్టి ♦ చాయఁజూచు
గట్టిగాఁ బల్క నేర్చుఁ దా♦నిట్టి తనయు
గతికి తల్లడ మందె నీ ♦ ఘనుఁడు తొల్లి.

చేయున దేమిలేక, తన♦చిత్తము నందుఁ బరాంబ నెంచి, యే
మో, యొనరించెయత్నములు♦నూనముగానవిశూన్యమయ్యెఁదా
శే, యెడఁగన్నలోకులు హ♦సించి రుతఃర్థ్యునిటుల్ దశాబ్దముల్
పోయిన వాండ్లమేలములఁ ♦ బొక్కనితండునెదర్ నృపాలకా!

తే. గీ. ఒక్కనాడర్ధరాత్రిఁ దా♦నొరుల కేరి
కెరుక పరుపక యేడకో ♦ యేగె నీతఁ
డతని వెదకుచు దేశదే♦శాంతరముల
బడలు చుండి రీ పుణ్యదం♦పతులు భూప.

తే. గీ. ఏ నెఱింగిన కథయిది ♦ యేను గూడ
నాటి నుండియుఁ జాంద్రాయ♦ణవ్రతంబు
సలుపుచుంటి నింతటి మహా♦త్ముల కొనర్చె
నట్టి నాయపచార పా♦పాగ్ను లార.

క. ఏనటు తిరిగెదు నెడ నీ
మానివరు కథా విధాన ♦ మాహాత్మ్యము నెం
తేనిఁ విని చూడఁగ నే
నీ నాడిట వచ్చినాడ ♦ నృపకుల తిలకా!.

తే. గీ. నావ్రతము పూర్ణమయ్యె ♦ దేవవ్రతాఖ్యు
కష్టములతోడ నీదివ్యుఁ ♦ గాంచి నంత
మ త్కలుష జాల మడఁగెఁ జు♦మ్మా యటంచు
గోబిలుండన నానృప♦కుంజరుండు.

ఆ. వె. అవలి కథ వచింపుఁ ♦ డన్న గోబిలుఁ డద్ది
యొరుల కెరుక పడని ♦ దుజ్జ్వలాత్ముఁ
డీ మహాత్ముఁ డనిన ♦ నిందర మాలింపఁ
గలము వాని నడుగ ♦ వలయుభూప.

అన విని జేడుజోతలిడి ♦ యావలిగాధ వినంగఁ గోరుచుం
టిని వచియింపవేడెద, ము♦ని ప్రవరా యనఁగానుతథ్యుఁ డం
బనుగని తల్లిదండ్రులకు ♦ వందనముల్ పొనరించి శాంతి ని
ట్లనె నటు లేరికి న్నుడువ♦కద్దమ రేయి గృహంబు వీడి నేన్.

తారగరాని కాఱడవిఁ ♦ దారుచుఁ జేరఁగరాని తావులన్
జేరుచు నెక్కరాని ధర♦ణీధ్రము లెక్కుచుఁ జూడరాని ఘో
రోరగ పాళి నుత్థితమృ♦గౌఘము జూచుచు మూడునాళ్లు లీ
తీరున సంచరింపగ న♦దృష్టవశంబున నొక్కనాఁడటన్.

దూఱగరాని చిట్టడవి ♦ దూటితిఁ బోయితిఁ గొంతదూర మా
చేరువ, భూధరోన్మధు వ ♦ శీకృత మత్తమధువ్రతైకఝుం
కార రవా మిళన్నిజవి♦కస్వర వేణుమనోజ్ఞ గాన లీ
లారత మానసాంబుజ కి♦రాతలతాంగులఁ గంటి భూమిపా.

క. వారలు నాకలిమంటఁ గు
మారిలు వనిఁ గాంచి జాలి♦మనములఁ దేనెన్
జేరలఁ బోసినఁ ద్రావియుఁ
గూరిమి నవ్వారిఁ బల్లె♦కున్ బోతి జుమీ.

తే. గీ. వారి పల్లెనుజుట్టియే ♦ పారుచుండు
నిగమసమ పావన తరంగ ♦ గగనగంగ
యందునుంటి నిన్నేండ్లు న♦న్నా పరిసర
కాననస్థలినే నీవు ♦ కంటి వధిప.

తే. గీ. పిదప కథ నీవెఱుంగు దే♦కద నృపాల
యనుచు మిన్నకుండిన, సర్వ♦జనులు వాని
యాననమువంకఁ గనుచుఁ జే♦రావనున్న
నవనిపుం డిట్టులనె; విన♦యంబు గదుర.

తే. గీ. అగు నెఱుంగుదునైన, వి♦ద్యావిశారద
మంబికామంత్ర సిద్ధ్యాదు♦లనుపమాన
లలితకవితా విరాజిత ♦ ప్రతిభయుఁ దమ
కే క్రియలభించెనో? తెల్ప♦వే మహాత్మ.

క. అనునంతలోన నీరము
కనుఁగవలన్ గ్రమ్మ వంటఁ♦గాంచుచు, హృదయం
బున, నిధ్యాన నిమగ్నతఁ
దనరుచు సత్యవ్రతుండు♦దై వారునెడన్.

సీ. మడమలనంటు, కెం♦జడగుముల్ సంజకెం
జాయ చాయలనెక్కి♦ సక్కెమాడఁ

గర్ణభూషణమైన♦కనుదమ్మిశాంతామృ
తతరంగశీకర♦తతులజిమ్మఁ

గావి పుట్టములోని♦కళదన్ని నెమ్మేని
ధవళరోచులు వింత♦తళుకులీన

నభయముద్రాంచిత♦మైన యంగుళులఁ బ్ర
వాళాక్షమాల వి♦భాసిలంగఁ.

తే. గీ. గళమునందు రుద్రాక్షమా♦లలు నటింప
నొకకరంబునఁ గుండిక♦యొప్పుచుండఁ
దను నరయువారిఁబరవశ♦త్వము రహింప
యోగిని, యొకర్తు వచ్చెలో♦నుల్లసిలుచు.

తే. గీ. అచ్చెరువుతోడ జనులెల్ల♦నామె నరసి
యొత్తిగిల్లి నిశ్చేష్టులై♦యుండి రంత
నామెమోమునఁ దా స్వప్న♦మందు కన్న
యంబ పోలికలుంట, స♦త్యవ్రతుండు.

తే. గీ. ఆమె దుర్గాస్వరూపమ♦టంచు భక్తిఁ
జేతులన్ మోడ్చ వాని కా♦శిషము లొసఁగి
మోవిచివురునఁ జిఱునవ్వు♦మోసులెత్తఁ
గనికరపుఁ జూడ్కిగముల న♦ల్గడలఁ జిమ్మ.

క. ప్రావృడ్జలధర గర్జా
రావము నిజగళ రవమ్ము♦రాపిడి సేయం
గా, వసుధాధిప, యిటనే
మే విననెంచిన వచింపు♦మీ యని నృపుతో.

శా. కాంచినయట్లు చెప్పెదఁ ద్రి♦కాలము లందు నెసంగు వానిన
భ్యంచిత యోగదృష్టి,జగ♦దంబిక భంగిఁ జరించెదన్ జగ
త్సంచయమందునన్నెఱుఁగఁజాలుమహాత్మకులుండినఁ బ్రపం
చించరునన్నుఁద ద్ధృదయ♦సీమలఁదక్కమఱెందు, భూమిపా.

క. అని, యీగతి నను యోగినిఁ
గని చిత్రప్రతిమ లట్లు♦గా భూనాథుం
డును తక్కంగలవారలు
ననియెన్ మందస్మితా స్య♦యయి యాపె యిటుల్.

ఉ. యోగ విలీన బుద్ధి నిట♦నొప్పిన వార్తలెఱింగియుంటి నీ
యోగమహాత్త్వతత్త్వ లస♦దుజ్జ్వలవర్తికిఁ బిన్ననాడ యే
లాగు బరాంబికాకృపఁ గ♦లా వితతుల్ లభియించెనో వినం
గాఁ గుతుకంబు నందితిరి♦గా వివరించెద విందు తత్కథన్.

క. అని యిటులనె, యోగిని, యీ
ఘనుఁడు తొలి జనిన్ జనించెఁ ♦ గాశీపురి నీ
వనమే గేహముగాఁ బా
వన మొనరుచుఁ దన్నుఁగాంచు♦వారల నెల్లన్.

క. వానప్రస్థుఁడు శ్రమ సం
ధానానూనైకయోగ ♦ తత్పరుఁ డంబా
ధ్యాననిమగ్నుఁడయి, ప్ర
జ్ఞాన విధానమున దిరుగు ♦ సతత మితఁడిటన్.

చ. అతఁడు సమస్తవిద్యలకు♦ నాలయ మాట యెఱింగి ప్రాగ్భవ
స్థితి మనగోబిలుండు, నొక♦శిష్యుఁడునై యిటఁజేరి వాని నం
చితగతిఁ గొల్వసాగెఁ దన శిష్యుని చూడఁడు పల్కరింపఁ డా
దృతిమెయి నేయదేనియు, వ♦చింపఁడితం డొకవేళ నేనియున్.

సీ. ప్రత్యూషమున్నను, పరాం♦బా ధ్యాన మగ్నుఁడై
లేచి దేశికు పద♦శ్రీకి నెరగి
యతఁ డుత్థితుండగు ♦ నంతకు నిజకాల్య,
ములఁదీర్చి యిలు దిద్ది♦ ముగ్గువెట్టి
గురునితోఁ దత్పరి ♦ కరపాళిఁగొనిపోయి
నదిమున్గి మడుగుల ♦ నుదికి తెచ్చి
యింటిలోఁ దత్పత్ని♦ యేమేమి, చెప్పిన
నాపను లోర్పుమై ♦ నాచరించి.

తే. గీ. యతిథి సేవల నొనరించి ♦ యాల నరసి
పాకమునఁ బాలుగొని, పసి♦పాపగముల
నటు నిటుం ద్రిప్పి మట్టమ♦ధ్యాహ్న వేళ
మాధుకరమున కేగు న♦మ్మాణవకుఁడు.

క. గురుఁడే పరదేవతగా
గురుఁడు భుజించినను గాని ♦ కుడువఁ డతఁడు త
ద్గురుఁడును వాఁడెటు లుండినఁ
బరామరిక చేయఁడొక్క ♦ పరియేఁ బ్రేమన్.

పలుకని దేశిక ప్రవరు♦పాదములన్ గొలువంగనేల, వెం
గలియని, తోడివారలు న♦గన్ విని తత్పదధూళియే కృతా
ర్థులనొనరించు, శిష్యుల ♦ నిరూఢతరేష్టములిచ్చి యంచుఁ దాఁ
బలుకునుగాని, దేశికుని పైఁగినియుండెద నే నొకప్పుడున్

పండువ వేళనైనఁ దన♦పంక్తి భుజింపఁగ రమ్మటంచుఁ జీ
రండు, స్వకీయదృష్టి కెదు♦రన్నిల ఛాత్రుఁడు వానిదిక్కు, చూ
డండెదొ జబ్బుచే నటమ♦టంపడు నప్పుడు నైనఁ బల్కరిం
పండొక నాటికేని, గురు ♦ వర్యుఁ డతండనఁ జెల్లదే నృపా.

అతఁ డంబాచరణాంబుజాత మకరం ♦ దాస్వాద నానంద వా
ర్ధితరంగంబుల మాటికిన్ మునుఁగుచున్ ♦ దేహాదులన్ గూడ వి
స్మృతిచెందున్ స్మృతికల్గెనేని, జనయి♦త్రీ, నాకుఁ బ్రత్యక్షమే
గతిగానయ్యెదవో? యటంచు మది నా♦క్రందించు రేయుంబవల్

తే. గీ. తన యనుష్ఠాన మేమొ, ని♦ధ్యాన మేమొ,
యంబికాభిషేకము లేమొ, యర్చలేమొ,
గాని, తక్కు ప్రపంచమే ♦ కాంచఁడాతఁ
డగ్గి వంటి బ్రాహ్మణుఁడు సు♦మ్మవనిపాల.

తే. గీ. ఒండుబుద్ధి శిష్యునిఁజూడ ♦ కునికిగాదు
లోక మఖిలము దుర్గా స్వ♦రూపమంచు
నంతలోఁ దన్మయత నొందు♦నట్టివాని
కితఁడు భిన్నుండనెడు భావ♦ మెట్టు లుండు?

తే. గీ. పదియు నాళ్లేడు లేగ నీ♦పగిది, నాతఁ
డొక్కనాడు దేహము వీడ ♦ నూహచేసి
యవని పై చేయఁ దగిన కా♦ర్యంబు లేమి?
యని వితర్కించి ఛాత్రు వృ♦త్తాంత మెంచి.

చేరువనుండ రమ్మనుచుఁ ♦ జీరి కరంబును వానిమూర్ధమున్
జేరిచి ధ్యానమున్ సలుపఁ ♦ జిత్రముగా, బహుళశ్రమార్జితా
పార కళాకలాపములు ♦ ప్రాప్తములౌట, క్షణంబులో కళా
శారద యయ్యెవాడు, నృప ♦ సత్తమ, తద్గురు శక్తి యెట్టిదో

క. ఇమ్మెయి శిష్యుని హృదభీ
ష్టమ్మిడి యేకాకియగుచు ♦ శారీరక బం
ధమ్ము లడఁచి మహా యో
గమ్మునఁ గాయము సుఖంబు ♦ గా విడి, యటుపై.

సీ. తానంబు, పారిజా♦త లతాంత మకరంద
ధారావిలోల శీ♦తల జలంబు
వలిపెంబు, సురనదీ ♦ జలజ కేసర కల్పి
త మనోజ్ఞ విద్యుల్ల♦తా ప్రభంబు

బోనంబు, శశికళా ♦ స్ఫుట పుటాంతర పయః
పక్వాతి మధుర ది♦వ్యామృతంబు
కృత్యంబు, జగదీశ్వ♦రీ పదాబ్జార్పిత
మందార మంజరీ ♦ మండితంబు

తే. గీ. విహరణంబు, భూరివిమాన ♦ విలస దమల
మందరాచల కైలాస ♦ కందరాంత
రాళములు గాగ స్వీయ పు♦ణ్యాళినెల్ల
ననుభవించె నిలింప రా♦జ్యమున నితఁడు.

తే. గీ. సుకృతి కావున సురవర ♦ స్తుత సుఖంబు
లీ కరణిఁబొంది, పుణ్యంబు ♦ లోకువైన
నవనిఁబుట్టె నుతధర్ముఁడై ♦ యధిప, గగన
వీధినుండి రాలిన చుక్క♦విధి నితండు.

తే. గీ. నాటి విద్యలె వీని కీ♦నాఁడునబ్బె
నాఁడు నిష్ఠఁ దపస్వియై ♦ నాడుగానఁ
గనకదుర్గాంబ నేడు సా♦క్షాత్కరించి
సూనుని విధాన వీనిఁ జూ♦చుకొను చుండె.

క. చదువుం గోరిన యర్థాన
కదనున విద్య నిడనట్టి ♦ యఘము నితండుక్
బదునాల్గేడులు గుడిచెను
విధియేనియుఁ గర్మ ననుభ♦వించును గాదా!

తే. గీ. నాటి భవమున ఛాతుర్ఁడీ ♦ నాడు గోబి
లుండయి, జనించి శపియించె ♦ లోకమందు
నెఱిఁగిన, నెఱుంగకున్న నో♦కింత యగ్గి
నంటినన్ బొక్కకుండునే ♦ యవనిపాల.

క. అని జాలిచూడ్కి మానిన్
గని దుర్గాచరణకమల ♦ కర్ణిక హృదయా
ళిని జోకొట్టుము నిత్యం
బును నమ్మినవాని నామె ♦ పోర్చుఁ గుమారా!

కడచిన జన్మలన్ సలుపు ♦ కల్మషపున్ ఫల మీ భవంబునన్
గుడుచుచు జీవకోటి కలఁ♦గున్ బహుభంగుల నట్టివేళ న
య్యెడ రుడుగన్ బరాంబిక భజించుచుఁ గొల్చుచునమ్మియుండునె
వ్వఁడతఁడనూన సౌఖ్యవిభ♦వప్రముదంబుధిఁ దోఁగుఁబుత్రకా!

అను నయ్యోగిని యాననాంబుజము నం ♦ దాత్మీయదృక్పంచరీ
కనికాయం బమరించి శ్రీ కనకదుర్గా! భక్తవర్గావవ
ర్గ, నమో వేదశిఖోపదిష్టిత కళా♦లంబా పరాంబా నమో
స్తని సాష్టాంగ నమస్క్రియా చరణుఁడౌ♦నవ్వాని నీక్షింపుచున్

క. భవదీయేచ్ఛల నన్నిటి
నవిరళ కరుణాసముద్ర ♦ యంబరయె యిడె మున్
గవివయి యశమందుచుఁ దుది
నవితత్త్వ పథమున్ గ్రహింపు♦మా నిత్యుఁడవై.

అని యాశీర్వచనంబొనర్చుచు, నదృశ్యంబయ్యెనాయంబ యంత నవారెల్ల రొండఖ్ళైటెంగి, తమలోఁ దద్దేవి యెందుండి వచ్చినదెం దేగిన దంచుఁ దత్కథలఁ జర్చింపంగ, సత్యవ్రతుం డను దుర్గాపదపంకజాతము లెదఁ ద్యానించి కన్నీటితో!

సీ. ఏతల్లి, యుపనిష చ్చూతశాఖోపరి
భాజితోదంచిత పరభృతంబు
ఏనిత్య, విశ్వవి శ్వానూన చిత్రిచి
త్రకళా ప్రదర్శిత దర్పణంబు
ఏ నిరీశ్వరి, దృఢ ధ్యాన యోగ విలీన
జన మనః కమల పుష్పంధయంబు
ఏ దయామయి, ఘోర మృత్యు వక్త్రానల
జ్వాలాప్రతాన నవ్యాంబుదంబు

తే. గీ. ఏ కళాలోల సర్వలోకైక సృష్టి
కావ్య కర్త్రి, యిక్కే చిదఖండమూర్తి
దాస హృద్వన మధుమాస వాసరంబు
ఆ మహాదేవి యోగిని యయ్యె నేడు?

తే. గీ. భక్త కామ్యైక కల్పక పాదపంబు
కనకదుర్గాంబ నాదు వాంఛను ఘటింపఁ
గనికరంబున యోగినిగాఁ జరించి
యింతవట్టును మనలఁ దరింపఁజేసె.

అని సత్యవ్రతుఁ డాడునంత, నగు ద♦థ్యంబిద్ది, యీాదాసు పై
ననుకంపన్ జగదేక మాత, యిటు లుద్యత్ప్రీతి యై వచ్చె,నం
చను వాక్యంబులతో సుమవ్రజము దా♦మాకాశ మందుండి దై
వనికాయంబు లుతథ్యపైఁ బరపి ర♦వ్వారల్ ప్రశంసింపఁగన్.

సీ. అరవిచ్చు నెడ లోనఁ ♦ బూరలు తేనె పెరల్లఁ
దళుకారు పూవు మొ♦త్తములు కొన్ని
క్రొందేన తరగలఁ ♦ గ్రోలి కైపున సొక్కి-
సోలు తేంట్లఁ దనర్చు♦ పూలు కొన్ని
యలరు నెత్తావి ది♦క్కుల గుబాళింపఁగా
విరిసి తూగాడు క్రొ♦వ్విరులు కొన్ని
నను పుష్పాదులు రేకు♦లను సోక నొకవింత
నలువు వన్నె నెసంగు ♦ ననలు కొన్ని
తే. గీ. కమ్మ తెమ్మెర యెమ్మెల ♦ గాని గడుసుఁ
జెయిది నానఁ దలిరుటాకు ♦ చిన్ని తెరల
సగము డాగు పువుల్ కొన్ని ♦ చదలనుండి
యా కవీశ్వరు నాదల ♦ యందుఁ గురిసె.

శ్రీ శ్రీ శ్రీ

శ్రీ కళాసిద్ధి

సంపూర్ణము.



## ఏతత్కవికృత గ్రంథములు వెలువడినవి

1. ఉమాఽవతారావళి
2. శ్రీ బాలాత్రిపురసుందరీశతకము 0-4-0
3. శ్రీ మతీదేవి (నాటకము)
4. ప్రేమపూర్ణ (పద్యములు) 0-6-0
5. రసాశ్రయము – (మధురమగు పద్యకావ్యము, శైలిసులభము నూతన భావములు శృంగార రసభరితము) 0-10-0
6. కనకదుర్గాశతకము 0-2-0
7. నరసాపుర శతావధానము
8. అమలాపుర శతావధానము 9. బళ్లారి శతావధానము } 0-8-0
10. ఏలూరు శతావధానము 0-4-0
11. శ్రీ కళాసిద్ధి – కవితాకళోపాసకుల కాదర్శప్రాయమగు స్వతంత్ర పద్యకావ్యము 1-0-0

## వె లు వ డు న వి

12. ఆంధ్రగరుడపురాణము – సంస్కృతమునుండి తెలిగింపఁబడినది
13. అజితసింహ – (చరిత్రాత్మక నాటకము)
14. ఛత్రసాల్ (డిటో)
15. అవధానతరంగిణి

ఇతరులొక్కదినమున వ్రాయించి పరీక్షించినవి

16. శ్రీ హనుమద్విజయము – (6 అశ్వాసముల ప్రబంధము శ్రీ శ్రీ మిట్టపల్లి రాజావారు వ్రాయించినది)
17. శ్రీ చెన్నకేశవ శతకము – (శ్రీ శ్రీ గద్వాల మహారాణీగారు వ్రాయించినది అచ్చయినది)
18. శ్రీ రామలింగేశ్వర శతకము – (మేడిచల్ వారు వ్రాయించినది)
19. శ్రీ వేంకటేశ్వర శతకము – (శ్రీ శ్రీ ఆరుమూరు రాజావారు వ్రాయించినది)
20. శ్రీ రామలింగ శతకము – (పాలమూరువారు వ్రాయించినది సుగంధి వృత్తాలు)
21. కుమారాభ్యుదయము – (పద్యములు నందికందిలో నొక శ్రీమంతుడు వ్రాయించినది)
22. శ్రీ వేణుగోపాల శతకము – (శ్రీ తిమ్మనగరం రాజావారు వ్రాయించినది)

(బుక్కుసెల్లరుల కనుకూలమగు రేట్లుకీయఁబడును)

దొరయువారు:— శ్రీ పతి త్ర్యంబకరావు, శతావధాని.
శ్రీ దుర్గాగ్రహారం, బెజవాడ.